సీ. మధుకరాశనమనోరథసిద్ధి వాటింప
సారస్వతోదారశక్తి గాంచి
సదమలామృతపదాశారసజ్ఞత దోప
సఫలసంకల్పప్రశస్తి గాంచి
పరభామినీసహోదరవృత్తి గన్పింప
సుమనస్సమాగమస్ఫురణ మించి
బంధురదివ్యప్రబంధరూఢి యెసంగ
నిత్యమాధవయోగనిరతిఁ బూని

తే. గీ. యెలమి సంశ్రితజనమనోభీప్సితార్థ
నిచయఘటనాసమర్థత నివ్వటిల్ల
జనిరి రాజేంద్రుకడకు నిచ్ఛావిహార
పారిజాతమ్ములో యన భాగవతులు. 5

శా. ఆ సౌజన్యగుణప్రసన్నముఖు లిట్లాస్థానముం జేరు ను
ల్లాసం బేర్పడ వచ్చుచున్నయెడ లీలన్ మంత్రిసంఘంబుతో
నాసక్తిన్ మనుజేంద్రచంద్రుఁడు సముద్యద్భక్తిసంయుక్తుఁడై
దాసోహమ్మని మ్రొక్కెఁ దచ్చరణపద్మప్రాంతధాత్రీస్థలిన్. 6

ఉ. ఆర్యజనాగ్రగణ్యు లపుడా నృపశేఖరుఁ జూచి దోర్బలౌ
దార్యసమృద్ధిరస్తు ధనధాన్యయశోవిభవోఽస్తు సంతతా
చార్యకృపాకటాక్షవిలసన్మహిమాస్తు సుపుత్రకోఽస్తు తే
సూర్యసమప్రతాప! యనుచున్ దగ దీవనలిచ్చి రందఱున్. 7

తే.గీ. సరవి నీరీతి మంగళాశాసనమ్ము
లెలమిఁ గావించు శ్రీవైష్ణవుల సభక్తి
వినయవినమితుఁడగుచు భూవిభుఁడు రత్న
చిత్రపీఠుల నుంచి పూజించె నంత. 8

వ. ఇవ్విధంబున నమ్మహాత్ములం బూజించి యమ్మహీకాంతుండు దానునుం దదనుజ్ఞ గైకొని యాసీనుండై వినయవినమితమస్తకుండగుచు వారలతో నిట్లనియె. 9

ఉ. శ్రీ హరిపాదపద్మతులసీదళతీర్థరసజ్ఞు లజ్ఞహృ
న్మోహనివర్తకుల్ భవవిమోచను లాశ్రితమోక్షలాభ ని
ర్వాహులు రోషలోభమదరాగవివర్జితు లూర్జితక్రియో
త్సాహులు నైన మిమ్ముఁ బ్రమదంబునఁ గొల్తురు ధన్యులెల్లెడన్. 10

సీ. భవబంధ మెడలించు బహుమునివ్రజవపు
స్సంగమంగళజలాభంగ గంగ
తనుతాప ముడిగించు వినుతషోడశకళా
పరిణామరుచిహారి పంకజారి
దారిద్ర్య మడగించు ధన్యలేఖజనౌఘ
కలితనిత్యశ్లాఘి కల్పశాఖి
యపమృత్యువు నడంచు నపగతాఘసుధీ
హృదానందరసపూర యమృతధార

తే. గీ. యిన్ని గుణములు గలసి యొక్కెడనె నిలిచి
యుండునే వార్ధికన్యాప్రియోరుచరిత
ఘనసుధాస్వాదవిదళితకలుషపాశ
వేష్టనులరైన మీయందు వెలయుఁగాని. 11

సీ. హారాళు లెంచ నాహారాళులే యంచు
గళమున వనదామగరిమ బూని
కేయూరరుచి మన కేయూర రుచియంచు
భుజముల దరచక్రములు వహించి
కటకానివృత్తి యక్కటకానివృత్తి యం
చౌకట చే నక్షమాలిక ధరించి
కాంచికాగుణ మిచ్చఁగాంచి కాగుణమంచుఁ
గటి తంతుసూత్ర మొక్కటి యమర్చి

తే. గీ. మణివిభూషణముఖ్యసంపత్సుఖైక
రసము నొల్లక గాఢవైరాగ్యలక్ష్మి
పేర్మి హృద్వీధి నొలయ గాంభీర్యరేఖ
నలరు మీవంటి ధన్యులెందైనఁ గలరె! 12

కం. అనుచు వినుతించి ముదమున
ననపాయనిజాభిలషిత మాపుణ్యులకున్
వినిపింపఁ దలఁచి క్రమ్మఱ
వినయానతవదనుఁడగుచు విభుఁ డిట్లనియెన్. 13

ఉ. అట్టి మహానుభావులు మహాగుణగణ్యులునైన మీరు మా
పట్టునఁగల్గుటన్ జతురపాంపతివేష్టితరాజలక్ష్మికిన్
బట్టఁపురాజనై విమలభాగ్యసమృద్ధిఁ బ్రసిద్ధిగాంచు నా
పుట్టువు సార్థమై వెలయఁ బుత్రులు గల్గ ననుగ్రహింపరే! 14

చం. ప్రకృతివికారమైన తనుభావము గల్గినచో నిజాన్వయో
పకృతి పరోపకారము లపాయములందఁగనీరయేని యా
సుకృతులు ధర్మకీర్తి పరిశుద్ధిఁ బ్రసిద్ధి వహింతు రింకఁ ద
ద్వికృతియొనర్చునట్టి యవివేకులు నిష్ఫలజన్మలెన్నఁగన్. 15

ఉ. ఆరయ నిట్టిరెండువనులందు నొకండు గులాభిరక్ష త
త్కారణభూతపుత్రఫలగౌరవరేఖ నలంకరించి భూ
భారము నిర్వహించు నదుపాయ మెఱుంగదలంచియే జడీ
ధీరజనాగ్రగణ్యులగు దేవరవారి గురించి వేడెదన్. 16

తే. గీ. అనుచు ననపత్యదోషభయాభిభూత
చిత్తుఁడై వేడుచున్న రాజోత్తమునకు
వరదులై యమ్మహాత్ములు కరుణ నెరయు
చూడ్కులలరంగఁ బల్కిరి సొంపుమీఱ. 17

## భాగవతుల యుపదేశము

కం. పున్నామనరకభీతి వి
పన్న పరిత్రాణకార్యభారగుఁడగుచున్
బన్నగరాజశయానుం
డున్నాఁడు మదిం దలంకుటుచితమె! నీకున్. 18

ఉ. ఉన్న జగత్త్రయమ్ము హరి యున్నతకీర్తి శుచిత్వలక్ష్యమై
యున్నది మింటనంటి ధ్రువుఁడున్నది ధారుణిపై విభీషణుం

డున్నది క్రింద దైత్యపతియున్నది పుణ్యపురాణసిద్ధమై
యున్నది తోఁచియున్న దికనున్నది యున్నద చిత్ర మన్నిఁటన్. 19

సీ. విప్రకోటికి వేదవిధిపేటి ముఖమయ్యె
నదిముఖంబయ్యె నయ్యభిముఖునకు
నాకంబున కజాండలోకమ్ము పదమయ్యె
నదిపదమ్మయ్యె నమ్మృదుపదునకు
సర్వభోజికిఁ జలచ్ఛదరాజి రథమయ్యె
నదిరథమ్మయ్యె నయ్యతిరథునకు
మునిమనఃకేళిక వనపాళి సుఖమయ్యె
నదిసుఖమయ్యె నయ్యధిసుఖునకు

తే. గీ. నతఁ డనంతుఁ డనంతలోకాంతరాంత
రాంతరిక్షాదిభూతమయాంగ జంతు
నిచయబహిరంత రనుగత నిజకళాంశుఁ
డధిప! నీచిత్తసంతాప మతఁడెఱుంగు. 20

సీ. శేషదిక్కుంజరశ్రేణి మాన్చి జగమ్ము
నిజకరాంగుళమున నిలువనోపు
నాగి జీవకోటుల నుపసంహరించి క్ర
మ్మఱఁ గ్రమ్ముకొనఁజేసి మనుపనోపు
బ్రహ్మాండభాండకర్పరము బ్రద్దలువాపి
చెలిమి నెప్పటియట్లు సేయనోపు
గడిఁదియై సప్తసాగరముల నింకించి
పెంపొంద మఱలనిండింప నోపు

తే. గీ. గిరులకరులఁ గిరులఁగరులుగాపుట్టించు
కిరులకరుల కరులఁగిరులఁ జేయు
నకట వాసుదేవు నఘటితఘటనాను
భావ మేమిచెప్పఁ బార్థివేంద్ర! 21

వ. అతం డెట్టివాఁడని తలంచితి రేని, 22

సీ. తరువఁ బ్రవ్వినవేళఁ దటికొండ డిగఁ బ్రావ
నరఁ బ్రేల నూఁదిన యతఁడితండు
మొసలి కాటులనోంప విసువు నేనుఁగు బెంప
నసము డింపక వచ్చు నతఁడితండు
రచ్చ రామొగరాన రెచ్చుసింగఁపుమేన
నచ్చుగా నరి వ్రచ్చు నతఁడితండు
కడిఁది వేలుపునింటఁ గలసిరుల్ గొనుదంట
నడుగంటఁ ద్రోచిన యతఁడితండు

తే. గీ. విను మతఁడతండు వల్లభ వనజభవము
హేంద్రసనకాది మానసాభీప్సితార్థ
దానధారేయుఁ డాశ్రితోదారధీవి
ధేయుఁ డిసుమంత నీకోర్కె దీర్పలేఁడె. 23

సీ. హరులచేఁ గరులచే నరుల గెల్వఁదరంబె
చక్రపాణి సహాయశక్తి లేక
కలిమిచే బలిమిచేఁ గులముఁ బెంపఁ దరంబె
రాక్షసాంతకు దయారసము లేక
సతులచే సుతులచే నుతులకెక్కఁ దరంబె
శౌరి కటాక్షవీక్షణము లేక
జపముచేఁ దపముచే నుపరమింపఁ దరంబె
కనకచేలుని యనుగ్రహము లేక

తే. గీ. మానవేశ్వర! యమ్మహామహుని కరుణ
కలుగదేనియుఁ గలుగునే! ఘనులకైన
నైహికాముష్మికసుఖమ్ము లతని నాత్మఁ
దెలిసి కీర్తించి నీకోర్కె దీర్చికొనుము. 24

శా. ఆ లక్ష్మీశపదాప్తికిన్ బహుళజన్మాయాసవిశ్రాంతికిన్
మూలంబైన తదీయభక్తిరచనామూలమ్మునన్ గోవిదుల్
బాలత్వమ్మున యావనమ్మున గుణప్రఖ్యాతి వాటించి వా
గ్జాలమ్ముల్ పచరింప రాత్మహితసౌజన్యమ్ము దైవారగన్. 25

భుజంగప్రయాతము. జరాజర్జరీభూతసర్వాంగయష్టిన్
బరీతోపరివ్యాధిబాధావిభూతిన్
నరుల్ బుద్ధిజాడ్యమ్మునన్ జొక్కు వేళన్
మురారాతి నేరీతిఁ బూజింతు రాత్మన్. 26

తే. గీ. కావున మనోవికారముల్ గ్రమ్మనీక
ఘనులు తద్భక్తిఁ గాంతురుగాన శౌరి
పూజనము బాల్యయౌవనంబుల ఘటింప
వలయు నదియట్టులుండె నీ తలఁచుపనికి. 27

కం. శ్రీరోపహారనియతిన్
వారిజదళనేత్రు భక్తవత్సలుఁ గరుణా
పూరితహృదయు భజింపు ము
దారత నీకోర్కె దీర్చు ధరణీనాథా! 28

వ. అనినం గందళితహృదయుండగుచు నమ్మహీపాలుం డమ్మహాత్ములకుఁ బ్రణమిల్లి నిటలతటఘటితకరకమలుండై యిట్లని విన్నవించె. 29

సీ. శ్రీరోపహారవ్రతారూఢి వాటింపఁ
దొడరుచో నేమేమి నడువవలయు
పుండరీకదళాక్షు పూజాపరత్వమ్ము
దాల్చుచో నేమేమి దడవవలయు
దైనందినముకుందధర్మనిర్మలగోష్ఠి
వెలయుచో నేమేమి విడువవలయు
చక్రాయుధధ్యానజపహోమకార్యముల్
గడపుచో నేమేమి నుడువవలయు

తె.గీ. నెంతకాలమ్ము గావింప నిందిరాను
నోహారుం డిచ్చమెచ్చి యుత్సాహ మొసఁగఁ
గింకరుఁడనైన నన్ను రక్షించు బుద్ధి
నంతయు నెఱుంగఁ గృపసేయుఁ డయ్యలార! 30

కం. అని యిట్లు విన్నవించిన
మనుజేంద్రునిఁ జూచి భువనమాన్యచరిత్రుల్
వినుమీ వెఱుంగఁదలఁచిన
పని యంతయు ననుచుఁ దెలియఁ బల్కిరి వేడ్కన్. 31

తే. నుడువు మచ్యుతనామముల్ విడువు మితర
తంత్రముల్ విష్ణుచరితామృతప్రసక్తి
దడవు మిహపరసౌఖ్యసందర్భనిరతి
నడువు మవనీశ! వేయు ననంగనేల! 32

సీ. ప్రకృతిభిన్నస్వాత్మ పరమాత్మసాంగత్య
మొకటియందొకటికా నుడుపవలయు
స్తవపూజనాహ్లాదతాత్పర్యశీలమ్ము
లొకటియందొకటిగా ననుపవలయు
భవ్యకర్మజ్ఞానభక్తియోగమ్ముల
నొకటిపై నొకటిగా నూఁదవలయు
నలమనోబుద్ధిచిత్తాహంక్రియావృత్తు
లొకటిచే నొకటిగా నడుపవలయు
తే. గీ. వలయు నీకింక నొక్కటి వనజనాభ
చరణకంజాతమంజులసౌరభాను
భవరసికభాగవతజనాపచితి యిదియె
మాధవారాధనప్రౌఢి మనుజనాథ! 33

తే. గీ. అధిప! భార్యాసమేతుఁడవగుచు నొక్క
వత్సరము బ్రహ్మచర్యానువర్తనమున
శ్రీహరి భజింపఁ గార్యసంసిద్ధి యగుట
నిశ్చయంబంచు పలికిన నృపవరుండు 34

ఉ. అంజలి చేసి పల్కెఁ బులకాంకురజాలము లంగకమ్ములన్
బుంజములై తలిర్పగుణభూషణులార! మదీయభాగ్య మె
ప్పెం జగ మిచ్చమెచ్చ నిరుపేదకుఁ బెన్నిధి గల్గఁగోరి సి
ద్ధాంజన మిచ్చినట్లు కృప నానతి యిచ్చితిరిట్టి ధర్మముల్ 35

ఉ. వందన మాచరింతు బుధవంద్యచరిత్రుల కేర్పడన్ బున
ర్వందన మాచరింతు గుణవైభవయుక్తులకున్ బునఃపున
ర్వందన మాచరింతు హితవత్సలచిత్తులకంచు భూమిసం
క్రందనుఁ డమ్మహాత్ములకు గాఢమతిన్ బ్రణమిల్లెఁ గ్రక్కునన్. 36

వ. ఇట్లు మనుజేంద్రుండు భాగవతశిఖామణులకుం బ్రణామమ్ము లాచ
రించి తత్తన్మందిరమ్ముల కనిచి తానునుం దదీయశాసనం బవలంబించి దక్షులగు
వారలం బురరక్షణమ్మునకు నియోగించి పత్నీసహితుండై శ్రీమన్నారాయణ
పరాయణత్వంబునన్ గృతవ్రతారంభుండయ్యె నప్పుడు. 37

## వ్రతారంభము

సీ. మృగనాభితిలకవర్ణితమైన నుదుటిపైఁ
బొలుపొందె ధవళోర్ధ్వపుండ్రరేఖ
యతులచీనాంబరోచితమైన నెమ్మేన
నలరారెఁ గృష్ణసారాజినమ్ము
సితహారపుంజరంజితమైన యురమునఁ
దళుకొత్తెఁ దులసికాదామపంక్తి
కాంచనవలయసంగతిగాంచు కరమున
నమరె వినూత్నపద్మాక్షమాల

తే. గీ. వితతమంజులమణిగణద్యుతివిదీప్త
చటులకోటీరయోగ్యమస్తకమునందుఁ
గీలితంబయ్యె హరిపదాంకితపటమ్ము
నచ్యుతారాధనోద్యుక్తి నవనిపతికి. 38

సీ. సమదేభతురగశిక్షాచమత్కారమ్ము
పరగించె నింద్రియపటలి యందు
శత్రురాజన్యదౌర్జన్యభంజనశక్తి
సమకొల్పె మదమత్సరముల యందు

నసి ధనుశ్శరకృతాభ్యాసకౌశలబుద్ధి
గరపె నష్టాంగయోగముల యందు
పరరాష్ట్రదుర్గసంపాదనక్షమవృత్తి
నెరపె భక్తిజ్ఞాననిరతులందు

తే. గీ. భాసురానర్ఘమణిగణభర్మరజత
జాలకౌశాలయేక్షణాసక్తి నిలిపె
కమలలోచను దివ్యవిగ్రహమునందు
భవ్యరుచిహేళి యమ్మహీపాలమౌళి. 39

కం. అతులితజపహోమంబుల
నతిశయమునఁ బ్రీతుఁ జేసె నంబుజనాభున్
బ్రతిమారూపమ్మున న
చ్యుతు నర్చితుఁ జేసెఁ దత్తదుపచారమునన్. 40

కం. కేసరములఁ గైసేసెను
గేసరినిభమధ్యఁ బద్మకేసరచేలున్
వాసి దగు మల్లికాసుమ
వాసనలన్ బొదవె భక్తవత్సలు పదముల్. 41

కం. చారుతులసీదళము లవి
కారత నర్పించెఁ దులసికాదామునకున్
క్షీరోపహార మొసఁగెను
క్షీరాంబుధిశాయికిన్ విశేషమనీషన్. 42

కం. కమలాప్తసదృశతేజుఁడు
కమలమ్ములఁ బూజచేసెఁ గమలాస్త్రగురున్
గమలాక్షు గమలనాభుని
గమలాహృదయేశు హృదయకమలం బలరన్. 43

వ. ఇవ్విధంబున నారాజదంపతులు భక్తినిష్ఠాగరిష్ఠులగుచు భగవత్సమారాధనం బొక్కసంవత్సరంబు సలుపుటయుఁ దదనంతరంబ. 44

## శ్రీమన్నారాయణ సాక్షాత్కారము

సీ. కలుములు వెదఁజల్లఁ గలశవార్ధి జనించు
మగువతో మొలతెంచు నగవుతోడ
పరిపూర్ణచంద్రబింబము వోలు చక్కని
మొగముతో శేషపన్నగముతోడ
మొనసి నారదముఖ్యు లొనరించు గానని
స్వనముతో గరుడవాహనముతోడ
ప్రభ మించు భద్రసుభద్రాదిపరిచరో
త్తములతో శంఖచక్రములతోడ

తే. గీ. సజలజలధరకోమలశ్యామలాంగ
కలితకీలితరత్నభర్మద్ధగాయ
మానభూషణరుచిభీతభానుకిరణుఁ
డబ్జనాభుండు ప్రత్యక్షమయ్యె నపుడు. 45

చం. వెలుచ ననేకజన్మకృతభీషణదోషకృపాణవంక్తి పై
నొలయఁగ నీని గట్టి మరువ్రాదినకై వడి నిందిరామనో
లలితవిహారి రాక నొడలన్ బులకాంకురపుంజపంజరం
బలవడఁ దాల్చె భూరమణుఁ డాచరణాననమస్తకమ్ముగన్. 46

మ. మృదునాళీకదళప్రదేశముల దారిందూరి లోవ్రాఁకలన్
గుదురై నిల్చు దుషారవారి పయిఁటేకుల్ వేఁకువన్ దుమ్మెదల్
జెదరింపన్ దొనుకాడులీల హరి విచ్చేయంగఁ గన్దోవలన్
గదలంబాఱె నృపాలదంపతుల కానందాశ్రుబిందుచ్ఛటల్. 47

మ. పతగాధీశ్వరు నెక్కి లేము లుడిగింపన్ జూచు వాల్గంటితో
శతసూర్యద్యుతి నిత్యధన్యగురుఁ డిచ్చున్ దోఁచినన్ మేదినీ
పతి దా వ్రాల్చినకన్నుదోయి కదలింపన్ జాలఁడయ్యెన్ సము
ద్గతసంతోషరసాతిరేకజనితాంతః పారవశ్యంబునన్. 48

కం. అంత నృపమౌళి లక్ష్మీ స
కాంతుని కృప విపులధైర్యగౌరవమేధా

వంతుండై వీక్షించె ము
రాంతకు శుభమూర్తి లోచనానందముగన్. 49

ఉ. కాంచి మహీవరుండు పులకప్రకరాశ్రుపరీతమైన మో
మంచిత భూపరాగపటలాంచితమై విలసిల్లినట్లు న
క్తంచరవైరి దివ్యపదతామరసమ్ముల వ్రాలె సంపతత్
కాంచనదండ రేఖ నవికారచిరంతనభక్తి వైఖరిన్. 50

వ. ఇత్తెఱంగున నమ్మహీకాంతుం డనంతశయనునకున్ బ్రణామమ్ము లాచరించి యిందిరాదేవికి వందనంబొనర్చి పరిషద్భాగవతబృందమ్మునకుం బ్రణమిల్లి కృతార్థంబైన చిత్తమ్ముతో నప్పరమేశ్వరు నగ్రభాగమ్మున నిటలతటఘటిత కరకమలుండై యానందబాష్పజలసిక్తకపోలుండగుచు నిట్లని వినుతించె. 51

చం. జయజయ! భక్తలోకహరిచందన పంకజగర్భపార్వతీ
ప్రియ! సనకాదిదేవమునిబృందనిషేవితపాదపద్మ! దు
ర్జయరిపురాజగర్వతరుషండదవానల! ధర్మమార్గని
శ్చయనిరతాంతరంగ! బుధసన్నుత యంచు నుతించి క్రమ్మఱన్. 52

సీ. అనిలాన్నవన్యాశనాంగమానసశయ్య
లోకనిద్ర యొకనిద్ర నొనరు ముద్ర
కమలకైరవలబ్ధకల్యాణదైవమ్ము
లొకకంట నొకకంట నొనరి యుంట
నరిశిరశ్ఛ్రవణదారాయుధశ్రేష్ఠమ్ము
లొకకేల నొకకేల నొనరు లీల
క్షాంతిసంపత్పూర్ణకాంతాలలామమ్ము
లొకక్రేవ నొకక్రేవ నొనరు శేవ

తే. గీ. పంక మణఁగింప లోకమ్ము లంకరింపఁ
జేయగల యాడుమొగపాప లాయితముగఁ
దగ నడుగుదమ్మి పొక్కిటిదమ్మిఁ బొడము
మహిమ నీయందె చెన్నొందె మధువిరోధి. 53

సీ. బహుభోగనిలయత్రిపాద్విభూతిసమృద్ధి
నుతికెక్కు నారాయణుండ వీవ
వాసుదేవాదిభవ్యవ్యూహభేదసం
గతుల మించిన జగత్పతివి నీవ
భువనరక్షణకళాస్ఫూర్తిచే నవతార
విభవము ల్గను జగత్ప్రభుఁడ వీవ
సకలచేతనకర్మసాక్షివై సదసదం
తర్యామి యగు మహత్తరుఁడ వీవ

తే. గీ. యీవకావె కవేరకన్యావిదూర
తుంగమణి హేమహర్మ్యసుమంగరంగ
పురవిహారివి, సితకీర్తిపరిచితాభ్ర
గాంగభంగ! విహంగపుంగవతురంగ! 54

శా. నే నేనోములు నోఁచినాఁడనో శరన్నిర్ణిద్రపద్మాక్ష! నా
నానైనోనిచయం బడంచితి సితాంతధ్వాంతమున్ సంతతా
నూనేనోస్త్రచయం బడంచుక్రియ నిన్నుం గొల్తు నెల్లెనఁ గా
నీ నేనౌననఁ గాదనాగలనె!రానీ నీదయాసారమున్. 55

చం. విదితజగత్త్రయాక్రమణవిశ్రుతి కాంచి విరించికుండికా
భ్యుదితపయఃప్రసేచనసమున్నతినొంది మహాఘవల్లికా
విదళన కేళిలోలుపలవిత్రములై విలసిల్లుచున్న నీ
పదకమలమ్ము లెప్పుడు కృపామతి నిల్పుము నా మనమ్మునన్. 56

వ. అని యిట్లు భక్తినిష్ఠాగరిష్ఠుండగు నృపశ్రేష్ఠుండు వినుతించుచున్న యెడ నప్పరమేశ్వరుండు కృపారసతరంగితంబులగు నిజకటాక్షవీక్షణమ్ము లతని పయిం బరగింపుచు జ్ఞానముద్రాముద్రితంబగు దక్షిణకరాగ్రంబు గదలింపుచు ముక్తాఫలదంతకాంతద్యుతిసహాకృతంబగు మందస్మితచంద్రికాజాలమ్ము నలుగడలం బొలుపుదీపింప సజలజలధరమధురభాషణమ్ముల నిట్లని యానతిచ్చె. 57

## వరప్రదానము

ఉ. ఇంపెసలార నాదుమతి నెంతయు మెచ్చితి మిమ్ము భూమిభృ
ద్దంపతులార! మీ హృదయతామరసమ్ములఁ గల్గు కోర్కెల
తీంపఁగ నయ్యె నట్లె పొసఁగించెద మీవలె మద్విధంబు ని
ష్కంపితభక్తిచే నెఱుఁగగానరు గా నరులెందుఁ జూచినన్. 58

కం. అనఘమతులార! మీ యం
దనుపమత మదీయకౌస్తుభాంశంబున నం
దనుఁడు జనియించుఁ దేజో
వినయోజ్జ్వలశౌర్యధైర్యవిశ్రుతు డెసఁగన్. 59

వ. అదియునుంగాక మదీయప్రియాంగన యగు నీళావధూటి యంశంబున భవత్పుత్రునకుం బుత్రికయై యొక్కకన్యాలలామంబు సంభవింపగలయది. మదీయ విభవస్థానంబైన శ్రీరంగంబునం బొలుపుదీపించుచున్న యే నవ్వారారోహం బరిగ్రహింపంగలవాఁడ మహీపాలా! నీయెడం గృపాళుండ నగుటం జేసి భవదన్వయంబు పవిత్రంబయ్యెం బొమ్మని యానతిచ్చి రథాంగధరుండు నిజభవనంబునకు విజయం చేయుటయు నా రాజదంపతు లానందభరితాంతఃకరణమ్ముల నగ్గరుడధ్వజుం బొగడుచు నాత్మగృహమ్ముఁ బ్రవేశించి రంత. 60

శా. (శ్రీ) దేవీపతి సత్కృపామహిమ ధాత్రీకాంతకాంతాసుత
ప్రాదుర్భూతికి వేగిరింప మణిరాజాంశంబు తద్గర్భ మ
ర్యాదన్ లోకసుఖప్రవర్ధనకరంబై యొప్పె నంతస్తమః
క్షోదాంచద్ఘటమధ్యదీపకలికాంకూరానుకారి ద్యుతిన్. 61

కం. వనజాక్షుకరుణ కేరళ
జనపాలాంగనకు భువనసంస్తుత్యకళా
జనకమగు కౌస్తుభాంశం
బనుపమజఠరప్రవిష్టమై పెనుపొందెన్. 62

సీ. ఖర్జూరవల్లరీగర్భపాంసుచ్ఛాయ
గండపాళికలపైఁ గానుపించె

కమలకోశాగ్రసంగతమధువ్రతరేఖ
ఘనపయోధరచూచుకముల నమరె
గ్రస్తపల్లవకంఠకలకంఠరవలీల
మందసల్లాపసంపదలఁ దోఁచె
వలితశైవలనూత్నవల్లీవిలాసమ్ము
సువ్యక్తరోమాళిఁ జూడనయ్యె

తే. వనధిమేఖల నొడుచు నర్భకుఁడు గర్భ
యుక్తిగన మధ్యమేఖల యొహటించి
కొలఁకు లందక మంజూషికల నడంగెఁ
జిగురుఁబోఁడికి దోహదశ్రీ వెలుంగ. 63

కం. మిసమిసయను చెలి మేనన్
బసపున నలుగిడుట వెఱ్ఱిపనియని చెలులా
రసికతఁ జూపరు మేలిమి
పసిఁడిన్ గరసానసేయు పనులుం గలవే! 64

తే. గీ. గర్భగతడింభకునియూర్పుగములు తోడు
పడిన కైవడి నిశ్వాసపంక్తి యింతి
వదనమున సంచరింప దుర్వారవిమత
జనపతుల కట్టి నిట్టూర్పు లినుమడించె. 65

ఉ. మించెఁ జెమర్చె పొంగె నని మేన ఘటింపక యింతి ద్రోఁచినన్
గొంచక తన్మనోహరుని కూరిమికిన్ గటకమ్ము కాంచి మేల్
గాంచు పురంబులయ్యె మొదలం దుదఁజెందు వివర్ణవృత్తి న
ర్థించి నిచోళ మంగదము దేశములయ్యె నృపాలమాళికిన్. 66

చం. హరిసతి శంభురాణి యచలాహితు నంగన యిట్టి నేర్పు ము
న్నరయఁగఁ జాలరంచు వసుధాధిపుదేవి తనంత మృత్కణో
త్కరరుచి గోరె కామశిఖకాండజయంతు లెఱుంగలేని త
త్సరస రసారసజ్ఞత నిజప్రభవవిష్ణుఁ డెఱుంగునట్లుగన్. 67

## కులశేఖరుని జననము

ఉ. ఆరయఁ గుంభసంక్రమణ మందు శుభానుగతిన్ బునర్వసూ
తార నుదారకీర్తి వనితాసహచారుఁ గుమారు సద్గుణా
ధారు నరేంద్రసుందరి ముదంబునఁ గాంచె సముల్లసత్పయో
వారిధిగర్భవీచి చెలువంబుగఁ జంద్రుని గన్నకైవడిన్. 68

కం. తనయుండు సంభవించుట
విని భూపతి సూతికానివేశమ్మునకున్
జని బాలు వదనకమలము
కనుగొనె సంతోష మాత్మ గడలుకొనంగన్. 69

తే. జనకునకు నాత్మభవరత్నజననవేళఁ
గానబడు పితృలోకతమోనివృత్తి
నాత్మభవరత్న ముదయింప నవ్విభునకు
గానఁబడె సర్వలోకతమోనివృత్తి 70

కం. సుతు కభ్యుదయముగా జన
పతి యానందమున నొసఁగె ధర్మాచల గో
వితతమణి చేల యువతీ
ప్రతతుల నమితముగ భూసురప్రవరులకున్. 71

ఉ. లోకహితార్థియైన శిఖిలోచను సాధనభాగవృత్తిమై
నాకుని పక్షహానియు మనమ్మున సైపక హేమశైలర
త్నాకరతోయముల్ దలపఁడయ్యె సుతోత్సవదానవేళ సు
శ్లోకులు సాధురక్షణవిలోపము సేయుట కోర్వనేర్తురే. 72

తే. చంద్రవంశావతంసమై సంభవించు
సుతున కన్వర్థముగనై యశోధనుండు
ప్రేమఁ గులశేఖరుండను నామమిడియె
సకలశిష్టసభాజనసమ్మతముగ. 73

వ. ఇట్లమ్మహీపాలుండు బాలునకు జాతకర్మ నామకరణాది సంస్కారంబులు నిర్వర్తించి సంతుష్టాంతరంగుండై యుండె నయ్యర్భకుండు క్రమక్రమంబున. 74

ఆ. వె. అక్క యత్త యవ్వ యనియెడి శబ్దమ్ము
లోలిఁ బలుక నేర్చు వేళలందు
రామ! రామభద్ర! రఘువీర! యనియెడు
పేరు లుగ్గడించి పిలువఁదొడఁగె. 75

కం. పాపని తొక్కతొక్క పలుకుల
లోపల రఘుతిలక!కమలలోచన!యను స
ల్లాపము లెఱింగి పొంగున్
భూపతి యొకభుజము రెండుభుజములు గాఁగన్. 76

సీ. శ్రీరామమూర్తి వర్ణించువారల పొందు
వీడఁ డాకొనియున్న వేళనైన
రఘునాథనామకీర్తనము సల్పెడుపట్టు
వెడలఁడు నిద్రించు వేళనైన
కాకుత్స్థవరు గుణోత్కర మెన్ను నెడఁ బాయఁ
జాలఁడు క్రీడించు వేళనైన
జానకీపతి కథాశ్రవణ మబ్బిన నొండు
వినఁ డంబ పిలిచిన వేళనైన

తే. దశరథాత్మజపాదపద్మప్రసక్త
చిత్తవృత్తికిఁ బరదైవవృత్తరక్తి
సొరగ నీఁడయ్యె మహనీయసుగుణగణవి
రాజితుండైన కేరళరాజసుతుఁడు. 77

చం. అతివలు నవ్వుటాలకు నృపార్భకుతోఁ దనతండ్రి ద్రోఁచినన్
సతియును దాను రాఘవుఁడు శైలములందుఁ జరించెనాఁగ దుః
ఖితుఁడగు జానకీవిభుఁడు కేవలమర్త్యుఁడె! సోదరుండు భూ
సుతయును దోడరా నగరుసొచ్చెననన్ మదిఁబొంగు క్రమ్మఱన్. 78

ఆ. వె. కోసలేంద్రతనయ కోమలవిగ్రహ
ధ్యానవశత నుండుచో నతండు
ననుభవింపఁగోరి యటమున్న తెమ్మన్న
దాది చేతిపండు తాఁ దినండు. 79

కం. కినియుచుఁ బోరిడు నతనికి
జనని గుడఫలాదు లొసఁగఁ జల ముడుగక యుం
డిన నెల్లివచ్చు రఘుపతి
మనయింటికి ననిన నలుకమాని చెలంగున్. 80

వ. ఇత్తెఱంగున నైసర్గిక శ్రీరామచరణకమలభక్తిభావనాధురీణుండగు కుమారు నుపనీతుం గావించి దృఢవ్రతుండు వివిధవిద్యావిశారదుం జేయఁదలంచి యార్యుల వశంబు చేసిన నతండు. 81

కం. క్షితిపాలసుతుఁడు గురుసం
గతి నతులితసూక్ష్మబుద్ధికౌశలమున సం
చితవేదశాస్త్రముఖో
ర్జితవిద్యానిచయ మభ్యసించెన్ బ్రీతిన్. 82

ఉ. క్రూరకుదృష్టిభాషణనిగూఢవికల్పితశబ్దలింగశా
రీరకశాస్త్రిసూత్రకబరీపరివేష్టితవిష్ణుతత్వమం
దారసుమమ్ము దాఁ గొనియె ధన్యవిచారుఁడు నీరసాగత
క్షీరవివేచనారచన చెల్వగు హంసకిశోరవైఖరిన్. 83

తే. వేదవేదాంగముల ధనుర్వేదమున న
రుంతుదాభ్యాసకౌశలస్వాంతుఁ డయిన
యక్కుమారునిఁ దోడ్కొని యార్యజనులు
పార్థివేంద్రుని కడకేగి పలికి రిట్లు. 84

శా. రాజన్మూర్తి భవత్తనూజుఁడు మనోరాజీవవీధిన్ మహా
రాజశ్రీరఘురామనామదివిషద్రాజాధిరాజాంఘ్రి సే
వాజాగ్రద్గతిఁ బూని నేర్చెఁ జదువుల్ వైదుష్య మేపార నో
రాజా! పాండురకీర్తిరాజనిధిముద్రా! రాజరాజోపమా! 85

సీ. అనఘ! పురాణవాగర్థబోధాయనుం
డాగత వివిధభాషాగురుండు
ప్రాకటన్యాయశాస్త్రైకదృక్చరణుండు
చతురాత్మపౌరుష శబ్దభోగి
విపులాహితైశ్వర్యవిక్రమబలభేది
రమ్యధర్మకళాప్తిరాజమౌళి
ప్రమదామనశ్చ్యుతి ప్రసవసాయకపాణి
ధృతిసార విహసిత క్షితిధరుండు.

తే. గీ. చతురగాంభీర్యవాహినీస్వామి పద్మ
వేష్టితపదార్థుఁ డనుభవవితరణస్వ
భావఘనుఁ డింక నిన్ను జెప్పంగ నేల
సుజనమాన్యుఁడు నీతనూజుండు రాజ! 86

చం. అనవుడు ధారుణీరమణుఁ డాత్మజుఁ గన్గొని బార సాచి య
క్కున గదియించి పెల్లెసఁగు కూరిమి పేర్మి నిజాంకపీఠిపై
నునిచి శిరంబు మూర్కొనియె నోలి కుమారు శిరోజపాళిఁ జెం
దిన నవమౌక్తికంబులగతిన్ ప్రమదాశ్రుకణమ్ము లొల్కఁగన్. 87

వ. ఇట్లమ్మహీవల్లభుండు ప్రమోదరసభరితాంతఃకరుణుండగుచుఁ గుమారు గారవించియాచార్యునకు ననేకమణిభూషణసువర్ణచేలంబు లొసంగి పరితుష్టులగు వారలయాశీర్వచనంబులు గైకొని యనంతరంబ కుమారునకు ననన్యకన్యాసాధారణమ్ములగు గుణసౌందర్యవిశేషమ్ములం బొలుపుదీపించు నొక్క రాజపుత్రికం బరిణయంబుగావించి పరీక్షితశుభలక్షణశోభితుండగు నతనివలన నాత్మీయ సామ్రాజ్యలక్ష్మి సురక్షిత యగుంగాక యనితలంచి నిజపరికరంబులతో నతని రాజపీఠంబున నభిషిక్తుంజేసి ప్రధానసామంతబలపరిజనభాండాగారంబులు మొదలగు సప్తాంగంబులతని వశంబుచేసి తన్నుం గృతార్థుంగా దలంచుచు నిర్భరుండై యుండె నంత, 88

## కులశేఖరుఁడు రాజగుట

కం. సాంద్రసుధాకరమగు మను
జేంద్రసుతాభ్యుదయమున మహీచక్రము ని
స్తంద్రఫలవృద్ధిగనియెన్
జంద్రోదయవేళ నలరు జలనిధి వోలెన్. 89

ఉ. సంతతసత్య దానగుణశాలి దృఢవ్రతనందనుండు కా
ర్తాంతిక విద్వదార్య కవిరాజ సుఖప్రదుఁడై చతుస్సము
ద్రాంత వసుంధరాభరణ మాత్మభుజాభరణమ్ము జేసె ది
గ్దంతి భుజంగరాజ కనకక్షితిభృత్కిటులన్ హసింపుచున్. 90

చం. వనులు ఫలప్రవాళసుమవాసనలన్ దటినీచయమ్ము గో
కనద బిసప్రసూన నవగంధ మనోహర తీర్థయుక్తి గో
ధనము పయఃప్రదోహనవిధానమునన్ ధర సస్యసంపదన్
దనరె దృఢవ్రతాత్మజుఁ డుదారత రాజ్యవిభూతి నందుటన్. 91

చం. భుజబలశాలి యవ్విభుఁడు భూరిశరాసనబాణధారియై
గజ రథ వాజి వీరభటగౌరవభీషణసైన్యబృంద మ
క్కజముగఁ గొల్వ నేగి పటుగర్వమహీపతికోటి నోర్చి ది
గ్విజయము జేసెఁ గీర్తిపదవీపిహితాంబుధి సప్తకంబుగన్. 92

సీ. ఆ ధనుర్ధరు ధాటి కంగరాజు చలింప
కర్ణాటవిభుఁ డిచ్చకంబు నెరపె
నాపుణ్యునకుఁ గామరూపభర్త ప్రియమ్ము
సేయ విదేహుండు సిగ్గువడియె
నావినోదికిఁ గుంతలాధీశ్వరుఁడు మ్రొక్క
కాశ్మీరపతి హితకారి యయ్యె
నాయజ్ఞరతుఁ గాశనాయకుండు భజింప
నేగి విదర్భవరేణ్యుఁ డోటువడియె
నాబలాఢ్యునకు మహారాష్ట్రరమణుండు
మ్రొక్కి వరాటేంద్రుఁ డుక్కుసెడియె

తే. పరగఁ బాంచాలపతి పద్యఫణితి నతని
వినుతిసేయంగ గాంధారవిభుఁడు పఱచె
బలియులగు వారలిట్లైన బలవిహీను
లేమిసేసెద రమ్మానవేంద్రు నెదుట. 93

సీ. అతని సౌందర్యధుర్యతకు వసంతుండు
బెదరి పట్టినకొమ్మ వదలఁడయ్యె
నతని విచారదక్షతకు దక్షుఁడు నాన
యెత్తి వంచినతల యెత్తఁడయ్యె
అతని మహాబలోన్నతికి భీతిలి మహా
బలుఁడు పాఱిన కాలు నిలువఁడయ్యె
నతని ప్రతాపానలాభీలతకు శూలి
తివిరి మూసినకన్ను తెరువఁడయ్యె 94

తే. గీ. నతని చెలియెంత యాతని యల్లుడెంత
యతని సుతుఁడెంత యాతనియశనమెంత
కాముఁడైనను రాజైన భీముఁడైన
గరళమైనను సరిసెన్న గలరె కవులు. 95

తే. గీ. అతని ధైర్యప్రతాపవిశ్రుతికి విబుధ
దంతివహ్నులు దలఁకి దిక్తటులఁ జేరె
నవియె చిరధారుణీభర మూని మోచె
నవియె భయమంది మిన్నుల నాశ్రయించె. 96

సీ. తన సఖిత్వము శారదాదేవి వాంఛింప
హాఁనీలవేణి పొమ్మంచుఁ బలికె
తన కుచాప్తత రాజతనగమ్ము గాంక్షింప
హారసతీనిలయ! పొమ్మంచుఁ బలికె
తన నేత్రముల మైత్రి ధవళాంబుజము వేడ
నలికులాకులము పొమ్మంచుఁ బలికె

* * * * *

తే. గీ. తన సితచ్ఛాయ సరిసేయఁ దగినవారి
నరసి లెన్నంగఁదొడఁగె నా నృపవరేణ్యు
కీర్తిసీమంతినీమణి కేళిసలుప
నవని కడద్రొక్కి వినువీథి కరుగునపుడు. 97

సీ. తెలిగన్నులకు మీను బెళుకు లెన్నినఁ జాలు
కలువరేకులఁ జెప్పవలె నటమ్మ!
మాటల కమృతంపు దేఁట లెన్నినఁ జాలు
కలికికోయిలఁ జెప్పవలె నటమ్మ!
తగు మోము చికిలియద్దము నెన్నుకొనఁ జాలు
వనజాతములఁ జెప్పవలె నటమ్మ!
గతులకు రాయంచగమన మెన్నినఁ జాలు
వారణమ్ములఁ జెప్పవలె నటమ్మ!

తే. పోలఁతి వర్ణించు కవివరుల్ప్రొద్దువోక
నిన్ని ద్రవ్వెద రనుచు దా నితరకాంతిఁ
గేలిగొను నమ్మహీనాథు కీర్తికాంత
ప్రాణసఖయైన మిన్నేటిపడుచుఁ గాంచి. 98

చం. అడుగునఁ బుట్టితీవు దివియందు జనించినదాన నౌట నే
పొడవని గంగ పల్కఁ, నరపుంగవు కీర్తివధూటి పల్కు నా
నడుగున నీవుపుట్టితివి హస్తతలమ్మునఁ బుట్టినట్టి నే
పొడవని యిట్లొసంగుదురు భూరి నభోంతరవీథి నిద్దఱున్. 99

కం. ధర విక్రమమునఁ గులశే
ఖర నృపతిం బోల్ప హృదయగతుల మహీపా
లుర వెదకివెదకి వేసరి
సరి కేసరి యొకటి యండ్రు సరసులు సభలన్. 100

కం. అని యతిశయోక్తి రచనన్
వినుతింపన్ దగి సముద్రవేలావృతభూ
జనరక్షాపరతంత్రత
నొనరెడి ధరణీశ్వరుఁడు సమున్నతలీలన్. 101

వ. వెండియు నఖండసామ్రాజ్యలక్ష్మీ కటాక్షవీక్షణసంధుక్షిత ప్రతిక్షణాభినవోదయవైఖరీనిరీక్షణోపగత నిజైశ్వర్యన్యూనతానుశయ సంక్షుబ్ధసహస్రాక్ష సంతాపనిశ్వాసశ్వసనఘటనా నిశ్శేషపరిశోషిత మకరంద పరిమ్లాన నిజసుందరీపయోధరమిళితమందారమాలికావిరక్త మధువ్రతనికరపరివేష్టితాత్మీయమహోద్యాన మండలుండును, మండలాగ్రవిధుంతుదకబళితవిరోధిరాజన్య యశశ్చంద్రికానిమీలనోన్మీలన సంతాపితతదీయకాంతా నయనోపాంత విగళితసాంజనసలిలధారాప్రవాహతిమిరప్రసారనిరోధకనిజతురంగరింఖాసంఘాతసంఘట్టనసముద్ధూతభూభాగారుణపరాగరేఖామయూఖానుమిత నిరవసాన స్వప్రతాపతపనోదయ సంప్రీడితపద్మినీబంధుండును, బంధుజననయనానందసంధాయక నిరంతరనిజకరతలవిముక్త దానధారాసలిలవేణికా పరిప్లుతసమస్తమహీవలయ సంచారసముదంచిత కీర్తిసీమంతినీ చరణపంకాంకిత దిక్కుంభికుంభమధ్యుండును, మధ్యమానమహార్ణవ సముదీర్ణ సంక్షోభ తిరస్కారకారణభూరిభేరీభాంకారరవశ్రవణసమయోపగతభయకుతూహలభరితామిత్రమిత్ర సముదయుండును, దయారసలేశమాత్రయోగ పాత్రభూతార్థిసందోహమందిరాంగణప్రవేశిత దంతావళకపోలమదామోదానుభవామోదిత మధువ్రతమాలికాఝుంకారరవాకర్ణనోత్సుకప్రాహూతికప్రశంసితనిజౌదార్యగుణవిశేషుండును గౌతమజైమినిద్వైపాయనప్రభృతి ప్రణీతవివిధతంత్రాంతరాశయారుందతు మేధాశాలి విబుధహృదయాహ్లాదసంధాయకుండునునగు నమ్మహీనాయకుండు మహనీయకుడ్యవిరచిత చిత్రపుత్రికాసౌందర్యావలోకన కుతూహలాయాతజనవిస్మయాపాదకంబును, మణిఖచితశాతకుంభస్తంభశోభావిభాసమానాభ్యంతరప్రదేశంబునగు సభామధ్యంబున విలాసినీకరకమల చలద్వాలవ్యజన జనితమృదుపవనంబులోలయ విచిత్రసింహాసనాసీనుండై సచివసామంతపురోహితప్రభృతులగు ముఖ్యజనంబులతోడసంభాషణంబులు సలుపుచుండె నంత. 102

## వైష్ణవ యతి వచ్చుట

సీ. జడలుగట్టిన శిరోజశ్రేణి బాలార్క
కిరణాంకురమ్ములఁ గ్రేణిసేయ
భూషితశ్వేతోర్ధ్వపుండ్రరేఖలలోనఁ
బచరించు హారిద్రరుచు లెసంగ

బహుతంతుకీలితపటమిళత్కంఠపా
ళిక పయోజాక్షమాలికలు గదల
పుణ్యతీర్థోదకపూరితంబగు తిరు
క్కావేరి వలకేలఁ గానుపింప

తే. గీ. భవ్యభుజపీఠి వ్రేలుచు దివ్యదేశ
గమ్యమృదుతీర్థగుళికల కక్షపాల
సారె నురియాడ శ్రీభక్తిసారు లనఁగ
నెసఁగ నొకయోగిశేఖరుం డేగుదెంచె. 103

వ. ఇట్లు చనుదెంచు యోగీంద్రు ననతిదూరంబునం గాంచి యారాజకులావతంసం బిరుగడల నాందోళితవ్యజనదండపాణులగు సీమంతినీరత్నమ్ముల కరతలమ్మున వారింపుచు కాంచనపీఠమ్ముడిగ్గ నుఱికి సంభ్రమంబున సభాసదులుం దాను నమ్మహానుభావు నెదుర్కొని ప్రదక్షిణపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబులాచరించి కనకాసనంబున నునిచి తప్తకాంచనకలశానీతంబులగు పూతశీతలసలిలంబుల నమ్మహాత్ము చరణంబులు గడిగి తత్తోయంబులు శిరంబున నిడుకొని యథావిధిం బూజించి తదనుజ్ఞఁ గొని తానును సముచితపీఠంబున సమాసీనుండై నిజవిలోకనకిరణాంకురనికరంబు లమ్మహనీయమూర్తి ముఖమండలంబునంబొలయఁ గరంబులు ముకుళించి సవినయంబుగ నిట్లనియె. 104

ఉ. ఏయెడ నుండి మీర లిపు డిం దరుదెంచితిరయ్య! మున్ను నేఁ
జేయు తపమ్ము లన్నియును సిద్ధివహించె రమామనోహర
శ్రీయుతదివ్యమూర్తి మదిఁ జేర్చి భజించు మహానుభావు లే
చాయకు వచ్చినన్ గలుషసంఘము వాయుట తథ్య మెన్నఁగన్. 105

కం. మది మిమ్ము గొలుచుటకు స
మ్మదమున భావింప నాడఁబోయిన తీర్థం
బెదురుకొనునట్లు మీ రి
య్యదనున విచ్చేసితిరి కృతార్థుఁడ నైతిన్. 106

మ. భవదావానలకాలమేఘము విపత్పాథోధిపోతమ్ము దుః
ఖవిషాభీలభుజంగబర్హిణము మహార్క్ష్యగ్రావదంభోళి దు
ర్వ్యవసాయాంధతమఃపతంగకిరణవ్రాతంబు, తాపత్రయీ
సవిధారణ్యకుఠారధార భవదీయాలాభ మెవ్వారికిన్. 107

కం. సంసృతివిపినము వెడలగ
సంసరణంబెట్లు దొరకు జడులకు భగవ
త్సంసత్ప్రియులగు యుష్మ
త్సంసర్గము లేకయున్న ధన్యవిచారా! 108

వ. కావునఁ బుణ్యపాపఫలమ్ము లెట్టివానికి ననుభవింపందగియుండు నెట్టి వానికి మోక్షమ్ము దొరకొను నదియునుంగాక నాకుం గాలక్షేపమ్ము సేయు సదుపాయమ్ము నెఱింగింపవలయునని ప్రార్థించినం బ్రీతుండై యమ్మునీంద్రుండు నరేంద్రునింజూచి యిట్లనియె. 109

## రాజు ప్రశ్నములకు యతి యుత్తరము

సీ. నిసువుఁబ్రాయమునఁ జెన్నెసఁగు నారాయణ
ద్వయమంత్రవర్ణసంతతులు గాంచె
చుంచు బెంచిననాఁడె మించు ద్రుంచిన వేల్పు
కొలము సామి భజించు నెల వెఱింగె
గరిడి ద్రొక్కిననాఁడె గర్వాంధపరిపంధి
కంధికి మంధాద్రికరణిఁ దోచె
నలుత జన్నిదమూఁదినప్పుడె తొలుపల్కు
కొనలఁ దోఁచిన తత్త్వమునఁ బెనంగె
తే. గీ. కర్ణ సనాగ్రభుజబుద్ధికౌశలములు
వర్ణనీయమ్ములయ్యె నవ్వాలనుగాంచి
కాంచుగా కేమి సిరి నెదఁ గాంచు విభుని
కరరత్నంబు పుట్టుపు గాంచుకతన. 110

వ. ఇట్టి నీవు పరతత్త్వవిచారపరుండవగుట యాశ్చర్యముకాదు కావున నీవడిగినప్రశ్నవచనంబులకు నుత్తరమ్ములు సెప్పెద నాకర్ణింపుము. 111

సీ. ఒనర నేబదికోట్ల యోజనమ్ములు గర్భ
గోళమ్ము దళ మొకకోటి యోజ
నంబులు గలిగి వర్ణ్యంబై హిరణ్మయాం
డంబు దీపించు నున్నతిఁ దనర్చు

నయ్యండమునకు జలానలానిలవియత్ప్రభృతి
సప్తావృతి ప్రతిభ దనరు
భువి యాదిగా సప్తభువనపర్యంతమ్ము
దగ నూర్ధ్వలోకసప్తకము వెలయు

తే. గీ. నతలవితలాదిసంజ్ఞల నమరి క్రింద
జగము లొకయేడుగలవు విశాలలీల
నిందు భువిదక్క దక్కిన పొందువట్లు
పుణ్యపరిపాకలభ్యముల్ భూవరేణ్య! 112

వ. ఇంక భూలోకవిశేషమ్ము పరిపాటి నెఱింగించెద. 113

కం. జంబూద్వీపము విస్తీ
ర్ణంబై యొకలక్షయోజనంబుల దగు దీ
నిం బరివేష్టించిన లవ
ణాంబుధికిన్ మాన మదియె యవనీనాథా! 114

వ. ఇత్తెఱంగునఁ బ్లక్షాదిద్వీపంబులేడును నైక్షవప్రభృతిసముద్రసప్తకంబు నొండొంటికిఁ ద్విగుణితయోజనవిస్తీర్ణంబులై విలసిల్లుచుండ సముద్రద్వీపపరిమితమహీవలయంబునకునినుమడియగుచు పిపీలికామశకమక్షికాదివిరహితంబును విబుధవిహారయోగ్యంబునునగు సువర్ణభూమి తేజరిల్లుచుండుమఱియును. 115

తే. గీ. అంతమీఁదట జక్రవాళాచలంబు
పసిఁడిపుడమికిఁ బెనుకోఁట పగిది నెసఁగు
నవల మిహిరాంశుజాలమ్ము లడర వదియె
బంధురాంధతమఃపుంజపంజరమ్ము 116

శా. సంబద్ధోరుతరప్రకాండనిచయచ్ఛన్నాంబరప్రోల్లస
జ్జంబూభూజపతత్ఫలవ్రజరసస్రావస్రవంతీతటీ
జంబాలోజ్జ్వలహేమకాంతిపిహితాశాకోణమై యుండుటన్
జంబూద్వీప మనంగఁ బెంపెసఁగు భాస్వల్లీల శోభిల్లుచున్. 117

కం. ఈజంబూద్వీపంబున
నోజః నవఖండములు సముజ్జ్వలలీలః
రాజిల్లు నందు నన్నిది
తేజోవిలసితము లగుచు దీపించు నృపా. 118

తే. గీ. ద్వీపషట్కభూమిఁ దిరిగెడు పుణ్యాత్ము
లాఁకలియును దప్పి యలఁత ముదిమి
దెవులు లేక నెపుడు తెలివొంది యుండుదు
రష్టఖండవాసు లట్టివారు. 119

వ. మఱియును. 120

మ. నిరవద్యాచ్యుతలోకలోలుపసుధీనిశ్రేణి కాదండ, మా
దరణీయాతిథికల్పకాండము వినూత్నశ్రీకరండమ్ము ని
ర్జరభాగాశనపూర్ణభాండము, త్రివర్గస్థేమశౌండమ్ము దా
నరతాత్త్వామృతఖండ మీభరతఖండం బొప్పు భూవల్లభా! 121

వ. మఱియు నిట్లుస్నానతపోయజ్ఞవసనభూషణాన్నప్రదానాదిసుకర్మంబుల వలన స్వర్గాదిపుణ్యలోకప్రాప్తియు బ్రహ్మహననసుజనతిరస్కరణపరధనపరదారాద్యపహరణ మృషావాదప్రముఖ దుష్కర్మంబులవలన నిరయనివాసంబును సిద్ధించు స్వర్గనరకాదిసంబంధంబులు జీవులకు స్వకర్మఫలభోగైకవినాశ్యంబులు కావునన్ బునర్జననకారణంబులై యుండు భగవన్మాయానిరుద్ధులగు బద్ధజనంబులు కామాది గుణవికారమ్ములం జేసికదా గదాధరు నారాధింపంజాలరు జాలరి జాలకంబునం బొదివి జలచరంబుల నిరోధించు చందంబున నప్పరమపురుషుండు నిజమాయావిశేషమ్మువలనం జీవులం జిక్కువఱచుచుండు మనుజసమూహంబు ధనదారపుత్రక్షేత్రాభిమానంబులను తిమినక్రఝషభుజంగంబుల నతిభయంకరంబగు సంసారసముద్రంబునంబడి మునుంగుచుండు. భగవత్క్రీడాపరికరంబును గుణత్రయాన్వితంబును నగు ప్రకృతివలనంబుట్టిన మహత్తత్త్వంబున నగు నహంకారంబువలన నయ్యెడు శబ్దస్పర్శాదితన్మాత్రలం బ్రభూతంబులగు గగనాదిభూతంబుల మేళనంబునం జేసి యాశరీరంబులు శరీరులకు భోగభాజనంబులగుచుండు. పూర్వాపూర్వజననావసరసముత్పాదితనానావిధకర్మఫలానుభవజనితవాసనావిశేషంబులవలన బహిరింద్రియోపకరణంబులను మనోబుద్ధ్యాదులు పెక్కుత్రోవలం ద్రొక్కింపుచుండు. నప్పరమేశ్వరుండే

తత్ప్రపంచంబునకు నుదయస్థితివిలయకారణమ్ములైన రజస్సత్వతమోగుణమ్ముల నాశ్రయించి వాసుదేవాదివ్యూహభేదమ్ములను రామకృష్ణాద్యవతారవిశేషంబులను వినోదంబుసలుపుచుండు నింకపునరావృత్తిరహితంబగు నప్పరమపురుషు పరమస్థానంబునకుఁ జేరుటుపాయమ్ములు కర్మజ్ఞానభక్తిప్రపత్తియోగమ్ములను నభిధానమ్ములం జతుర్విధంబులని యార్యులవలన వినంబడు, నవి యెయ్యవియనంటేని శ్రీవిష్ణుమందిర నిర్మాణ తదీయసమ్మార్జన దీపారోపణ మాల్యసమర్పణాదికంబును పంకజోదర కైంకర్యరూప తపోదానయాగాధ్యయనవనతటాకాదినిర్వర్తనంబులను క్రియావిశేషంబుల నగునది కర్మయోగంబనంబడు, నట్టిది జనకమహీపతిప్రభృతులయందు ప్రఖ్యాతంబయ్యె స్వస్వరూపపరస్వరూపవిరోధిస్వరూప ప్రభృతివిషయకంబైన యథాబోధంబు జ్ఞానయోగంబనంబడు, నట్టిదినారదాదిమహామునులయందు విశ్రుతంబగుచుండు విజ్ఞానపరిణతంబును సత్త్వగుణాతిరేకోపగతపులకాంకురబాష్పగద్గదస్వర వికారాదిగుణవిలసితంబును విచ్ఛిత్తివిరహితంబునునగు భగవద్విషయప్రేమవిశేషంబు భక్తియోగంబనంజను, నది ప్రహ్లాదప్రభృతులయందుఁ బ్రసిద్ధంబయ్యె నింకఁ దృప్తప్రపత్తియు నార్తప్రపత్తియునననఁ బ్రపత్తియోగంబు ద్వివిధంబైయుండు ముకుందభక్తిపరిపాకంబువలన దేహదేశకాలాదుల వైరాగ్యంబువలనను నిత్యయుక్తంబులగు తాపత్రయజనితదుఃఖమ్ములవలన నసహిష్ణుతంజేసి విష్ణుదేవునిం గూర్చి యాక్రోశించునది యార్తప్రపత్తియనంజను నది గజేంద్రముఖ్యులయందు విఖ్యాతంబయ్యె నింక నాచార్యకృపాలబ్ధంబులగు పంచసంస్కారంబులవలనం బవిత్రితగాత్రుండగుచుఁ దదుపదిష్టతత్త్వజ్ఞానవిశేషవిశదీకృతాంతఃకరణుండై స్వపారతంత్ర్యంబును భగవత్స్వాతంత్ర్యతయు నెఱింగి యాశేషతల్పునకు శేషభూతుండును బరమభాగవతసేవానిరతుండును నగుచు గృహస్థుండయ్యును సుహృత్కళత్రపుత్రక్షేత్రారామపశుప్రముఖంబులను ధనంబులయందు మమత్వమ్మువిడిచి యరవిందభవ భవేంద్రసనకప్రముఖ వర్ణనీయంబులగు నయ్యంబుజేక్షణు దివ్యరూప దివ్యగుణ దివ్యమహిమైశ్వర్యంబులు మనంబులం దలంచి పులకితశరీరుండగుచు మోక్షపర్యంతంబు కాలక్షేపంబుసేయునది తృప్తప్రపత్తియనంజను, నట్టిది వశిష్ఠపరాశరశౌనకవ్యాసాది ఋషులయందును బ్రియవ్రతోత్తానసుత ధ్రువ నాభి వైన్య రుక్మాంగదాంబరీష ప్రభృతిరాజముఖ్యులయందును సుప్రసిద్ధంబయ్యె నదియట్లుండెఁ గారణజన్ములగు మీవంటియుత్తమపురుషులకీధర్మంబులు సులభంబులైయుండు

నదియునుంగాక శరవాచకశబ్దంబులకు శరీరిపర్యంతధావనంబుగలదు కావున జగచ్ఛరీరుండగు నప్పురుషోత్తముండు సకలశబ్దవాచ్యుండగు నైనను విష్ణునారాయణవాసుదేవాదిదివ్యనామంబులతనియందు ముఖ్యవృత్తిం బ్రవర్తించుటంజేసి తదాత్మకంబయినమంత్రంబులు ప్రపన్నులకు నవశ్యానుసంధేయంబులని వేదవాక్యంబుల వినంబడు నదియునుంగాక భవజ్జననసమయంబున దృఢవ్రతకాంతానిశాంతంబునకుం జనుదెంచి సూత్రవతీకాంతుండేకాంతంబున శ్రీమన్నారాయణదివ్యమంత్రంబు నీకు నుపదేశించుటంజేసి మున్న కృతార్థుండవై యున్నవాడవైనను సంధుక్షితమోక్షలక్ష్మీసమ్ప్రతీక్షితులగు విచక్షణులకు ననంతశయను ననంతగుణకథనశ్రవణంబులం గాలయాపనంబు సేయవలయుంగావున భాగవతకులావతంసంబ! నీవునుం దొల్లి బృందారకబృందసంప్రార్థితుండై గోవిందుండు రావణవధార్థంబుగా దశరథసుతుండై యుదయించి చేయుకార్యంబులు వల్మీకసంభవుండు శ్రీరామాయణంబను నభిధానంబిడి రచియించు నితిహాసంబు పరమపవిత్రంబును నిహపరసౌఖ్యసంధాయకంబును నగుటం జేసి యాప్రబంధంబు శ్రీవైష్ణవసన్నిధానంబున గాలక్షేపంబుసేయునదియని యాదేశించిన నాధరాభారధౌరేయుండు రోమాంచకంచుకితశరీరుండును ప్రమోదబాష్పసలిలసంసిక్తకపోలయుగళుండును నగుచు నమ్మునివరునకుం బునఃపునఃప్రణామంబు లాచరించి యంజలిపుటంబు ఫాలతటంబునం బ్రస్ఫుటంబు గావింపుచు నిట్లనియె. 122

చం. యతివర పంక్తికంఠుఁడు సురావళి నెట్లుజయించె వారతే
గతి హరిఁగాంచి వేడిరి జగన్నుతుఁడేమనియానతిచ్చె సం
శ్రితహితవృత్తిఁ దా నవతరించి విరించివరానుభావగ
ర్వితులగు దైత్యముఖ్యుల హరించిన చందమెఱుంగఁ బల్కవే! 123

కం. సారములు సాధునిచయా
ధారములు నిశాటహృద్విదారములు మహో
దారములు మోక్షలక్ష్మీ
హారములు రమాధిపతి విహారములరయన్. 124

కం. కావున శ్రీహరిచరితము
పావనము శుభాన్వితమ్ము ప్రమదం బెసఁగన్
నీవలనన్ వినవలె నని
భూవరుఁ డర్థింప యోగిపుంగవుఁ డనియెన్. 125

## రావణోదంతము

సీ. వినవయ్య! విశ్రవస్తనయులు రావణ
కుంభకర్ణులు జగత్క్షోభ మెసఁగ
నవ్విరించి గుఱించి యతిఘోరమగు తపం
బాచరించిన మెచ్చి యవ్విధాత
సురదైత్యనాగకిన్నరయక్షముఖ్యుల
వలన నొప్పమిలేని వరము లొసఁగె
నది కారణమున దుర్మదగర్వదుర్వార
సంరంభుఁడై దిగీశ్వరులఁ దొడరి
తే. నొడిచె నగధారి మృగధారి నోటువఱచె
నణఁచె నరభోజి హరివాజి నపహరించె
తఱిమె ధనరాజు దినరాజు దర్పమణఁచె
గెలిచె నలకేలి వలకేలి కేలిగతుల. 126

కం. అంత నిరంతరరోషగు
రంతోగ్రబలేంద్రజిద్భుజాక్రాంతుండై
వాతఁబడవలసె నమరా
త్యంతీనుండైన ధవళదంతీశునకున్. 127

స్రగ్ధర. మదవద్దైత్యేంద్రరక్తాంబకచలనచలన్మంజులస్వర్గలక్ష్మీశ్ర
పదమంజీరారవోజ్జృంభణత ననుమితాపద్భయుల్ దివ్యలాత్మా
స్పదకాంతారంబు డాయంజనఁగ బెదరి కుంజస్థసింహౌఘ మంత్రి
స్యదసీర్యద్గ్రావమై విచ్చలవిడి విబుధస్థానముల్ జేరు నోలిన్. 128

మహాస్రగ్ధర. తూలెన్ గైలాసమత్యద్భుతశిఖరశిఖాందోళనధ్వానకువ్య
ద్వ్యాళీనిశ్వాసధూమవ్యతికరఘనానావారిదభ్రాంతచేతః
ఖేలత్తద్బర్హికేకాకృతగుహాపదకేకిప్రతిధ్వానమై ద
ర్పాలీఢానేక లోకోద్యమ దశవదనోద్యద్భుజోత్సాహశక్తిన్. 129

ఆ.వె. అమరు లలిగి వరప్రౌఢి నమరు లలిగి
నిశితపత్రిదశద్వేషి నిశితపత్రి
గతులఁ గఱచిన బహుపత్రిగతులఁ గఱచి
పర చిరంతనహాస్యులై పఱచిరంత. 130

తే. ఇంచుకించుక వడిఁదైన నంచితాస్త్రి
సంచయాభీలశౌర్యు నక్తంచరేంద్రు
నొంచుటకుఁ జాల కమరులు సంచలించి
యాచరాతింటిపంచనే లంచుఁ జనిరి. 131

వ. ఇట్లేతెంచి విరించిఁగాంచి దండప్రణామమ్ము లాచరించిన సుపర్వుల
పరిశ్రాంతి నిరీక్షించి యతండు వారలతో నిట్లనియె. 132

సీ. వింతగారుల మేలుబంతి నీచౌదంతి
యేదొంతిఁ జొచ్చె నహిప్రభేది!
నిక్కి వైరులఁ ద్రొక్కు నీపోతుజక్కి యే
చక్కిఁ జిక్కెనొ విభాస్వత్కుమార!
పసలేమి విసివి నీముసలి దాయుసలిఁదై
మసలెనో జలధిసామ్రాజ్యధుర్య!
కొంక దిజ్జగతి నిశ్శంక నీజింక యే
వంక జంకెనొ గంధవహనశాతి!

తే.గీ. వాహనము లాయుధమ్ములు వదలి యలసి
సొలసి యేతెంచితిరి దశాస్యునకు నేను
వరము లిచ్చుటెఱింగియు వానితోడ
కయ్యమున కిచ్చగొనరు గదయ్య! మీరు. 133

వ. అనినం ద్రిదశపతులాభాషావతితో నిట్లనిరి. 134

తే.గీ. ఇంటిముంగిట నుండనీకెగచియెగచి
యసురబూతంబు వెనువెంట నంటి తఱుము
వచ్చుటయకాని వానితో వైరమెత్తి
పోరొనర్పంగఁ దరమె యెవ్వారికైన! 135

కం. పెనుఁ బ్రేవేల్లగిబ్బ కొమ్ముల
కొనలకుఁ బదనిచ్చి విడుచుకొమరున మీరా
దనుజులకు వరములొసఁగిన
గినిసి యతనిఁ దొడరవశమె! గీర్వాణులకున్. 136

వ. అనిపలికిన వారలపలుకులకుఁ జిత్తమ్మునం గనికరమ్ము వొడమి పద్మసంభవుండు పాకశాసన పావక పరేతపతి పలలభోజన పాశధర పవన పౌలస్త్య పార్వతీపతులం దోడ్కొని పాలకడలిపట్టునకుం జని యొక్క శుచిప్రదేశంబున నాసీనులై నియమితేంద్రియవ్యాపారులగుచు శ్రీహరి నారాధించుచున్న యెడ. 137

సీ. మొలకలెత్తెడునవ్వు ముఖసుధాకరునిపై
నవచంద్రికాసమున్నతి నెసంగ
నసుకొన్న కరుణారసమ్ము కన్దమ్ముల
మకరందబిందుసంపద వహింప
పొలుపొందు కలుములబోటి వక్షఃపీఠి
తగు రత్నరేఖావిధమ్ము దాల్ప
విలసిల్లుదరచక్రములు భుజోదయశృంగ
ములఁ గేవఁ జంద్రార్కకలనఁ బెనుప

తే. లలితపీతాంబరము గాత్రజలధరమున
మించు క్రొమ్మించు తెఱఁగున మెఱుపులీన
చటులఖగరాజ పక్షఘోషము లెసంగ
శౌరి విచ్చేసె నిర్జరేశ్వరుల కడకు. 138

వ. ఇత్తెఱంగున మొదలిచదువుల తుదలంబొదలు కలిమిచెలి మగనిరూపు చవి చూపులంగ్రోలుచు నొండెఱుంగక యొక్కింత తడవూరకుండి యంతఁ దెలివిగైకొని యమ్మహాపురుషునిం గాంచి. 139

చం. సనకసనందనాదిమునిసన్నుతపాదసరోరుహాయ, స
జ్జనవిపదంధకారదివసప్రభవే, కమలాలయాఘన
స్తనతటకుంకుమారుణవిలాససముజ్జ్వలవక్షసే, సుహృ
ద్వినయవిదే నమో భగవతే భవతే! యని మ్రొక్కి రందఱున్. 140

మ. అపు డద్దేవవరేణ్యు లాత్మనిటలప్రాంతమ్ములం జేర్చుపా
ణిపుటంబుల్ విలసిల్లె రావణభుజాన్వీతజ్వలచ్చంద్రహా
సపటుక్షేపనిరీక్షణోదితమహాసంతాపముం జెందు డెం
దపుఁ గెందమ్ములచంద మచ్యుతునిచెంతం దెల్పునట్లొప్పగన్. 141

కం. చతురానుపమోక్తుల న
చ్చతురాననుఁ డాత్మవినయసంభృతుఁడై స
న్నుతి గావించిరి శంకర
శతమన్యుప్రభృతులును వచస్స్ఫురితులుగన్. 142

చం. జయజయ! భక్తలోకహరిచందన! నందసునందపత్రి రా
డ్జయవిజయాదినిత్యపరిషద్భజనీయనిజస్వరూప! దు
ర్జయదనుజాటవీదవధనంజయ! వేదశిరస్స్థలీ
శయితమరాళ! కాననగజశ్రమమోచన! పద్మలోచనా! 143

సీ. పదముల భవబంధచయముఁ బాపెడు ప్రాఁక
పదములందు జనించి బయలు ప్రాక
యొడలిపైఁ దెలిఛాయ కడలఁ జిమ్మెడి చివ్వ
కడలిపై నునుపాన్పుకరణి గొల్వ
కరమునందు సువర్ణకమలమూఁదిన చాన
యురమునందు వసించి యొరపు బూన
శ్రుతులందు నుతులఁ బేర్కొన్న చిల్వలగొంగ
గతులందు వైభవోన్నతి నెసంగ

తే.గీ. నతివిచిత్రప్రభావాభిమతవిలాస
భాసురోదారచరిత మేర్పడిన నిన్ను
సన్నుతింతుము రక్షితసకలభువన!
జంగమస్థావరప్రాణి చక్రపాణి. 144

ఉ. కాదనరాదు కాదు శిఖి కంధి నడంచు భవత్ప్రతాపముం
గాదనరాదు కాదు ఫణి కాశ్యపిఁ బూన్చుమహోపకారమున్
గాదనరాదు కాదు ఘనుకాంతి నడంచుతనూవిలాసమున్
నీదువిహారముల్ దెలియ నేరరుగా విధిముఖ్యు లీశ్వరా! 145

కం. అనుచుఁ జతుర్ముఖుఁ డీక్రియఁ
దను నుపనిషదర్థగతులఁ దగ వినుతింపన్
విని పద్మలోచనుఁడు కృప
నెనయు మనోవృత్తి దెలియనిట్లని పలికెన్. 146

ఉ. ఏమి హిరణ్యగర్భ! పని యేమి శచీశ్వర! వహ్నివారిధి
స్వామిమరుత్కుబేరదివసప్రభుచంద్రములార! మీర లే
మేమొకొ దా భయం బడరి యిట్లరుదెంచుట పంక్తికంధరో
ద్దామభుజావిజృంభణవిధానము సైపక నో! తలంపగన్. 147

కం. హరి యిట్లు లానతిచ్చిన
సరసిజగర్భుం డా విపులసంతోషాంతః
కరణుండై పురుహూతుం
గరము ల్లాసమున సైగగాఁ గనుగిలిపెన్. 148

శ్రీమన్నారాయణునితో నింద్రుఁడు తనపాట్లు చెప్పికొనుట

తే. గీ. శిఖికలాపాగ్రమేచకశ్రీ నెసంగు
లోచనసహస్ర మమ్మేఘుపేచకాంగు
మోముచందురుపైఁ బర్వ మ్రొక్కులిడుచుఁ
జేరి వృత్రారి తమకత చెప్పఁదొడఁగె. 149

కం. అనుపమభుజశౌర్యమునన్
మువు జగముల నేచు రావణుఁడుతపస్సం
జనితబలమ్మునఁ గ్రమ్మఱ
వనరుహసంభవుని వలన వరములు వడసెన్. 150

కం. రక్కసుల తేఁడు తన పే
రుక్కున బలి గెలువఁబోయె నోహో! తన యూ
రెక్కడ! సుతలం బెక్కడ!
నక్కజ మగుచున్న దిప్పుడది మదిఁ దలఁపన్. 151

సీ. సాలయ నెల్లెడఁ ద్రిప్పి సురభిఁ గ్రొక్కారఁ ద్రాళ్ళ
స్రుక్కఁజేసిరి పాలుగ్రోల ననుచుఁ
దటిమి నైరావతదంతిదంతమ్ములు
పెకలఁదీసిరి వాలుబిడులకనుచు
ననయులై పారిజాతాదిద్రుశాఖల
విఱుగఁద్రొక్కిరి మంచివిరులటంచు
బలిమి రంభాదికాంతల పయ్యెదలు పట్టి
తలఁగఁజేసిరి కేళికలకు ననుచు

తే.గీ. నసురు లిబ్బంగి విశచక్రల్హారకమల
కైరవస్ఫారసౌరభోద్గారిపుణ్య
వారిశోభిత గగనస్రవంతిఁ జొచ్చి
కసటుగల్పిరి మేనులు గడిగి కడిగి. 152

తే. వరములందిన యప్పుడ సరవి నాతఁ
డమరకాంతలఁ జెఱగొందు ననుచుఁబలికె
నాది నిదిచెప్పవలయు నాహా! నిశాట
కపటకృతి బుద్ధి కొకపాదు గలుగనీదు. 153

సీ. దనుజేంద్రుసంధికై త్వష్ట నందుఘటింప
నతని స్వహర్మ్యనిర్మితికిఁ జొనిపె
నడలక నంత వైశ్వానరుఁబుత్తేర
నతనిఁ బాకక్రియాన్వితునిఁ జేసె
పనిదప్పనని సమీరునిఁ బంప నతని శు
ద్ధాంత కేళీశ్రమం బణఁప నునిచె
మానక విధుని సన్మానించి పంచిన
నతని నుద్యానానుగతిని నిలిపె

తే. మన బృహస్పతి నర్థించి పనుప నతనిఁ
గాంచి శుక్రుండు సుతులతోఁ గవసి పలుగు
రాల వైచుచుఁ దటిమినఁ జాలుననుచుఁ
బుడమి యు[illegible]రంగఁ బఱతెంచి పురముసొచ్చెఁ. 154

ఉ. అక్షత వార్ధిజన్యధవళాశ్వము నెక్కి జయంతుఁ డేగ, ధూ
మ్రాక్షుఁడు దాడిమైఁ జనుచు నాతనిఁ ద్రోఁచి హరిన్ హరింప, నా
రాక్షసుఁ దాఁకనోడిరి సురప్రభులట్లనె పోఁ జుమీ! రమా
ధ్యక్ష! మదూర్వశీవచనహాసవిలాసము లాఁగకుండినన్. 155

తే. కుంభుఁ డటవచ్చి వెలిగిడ్డి గొనియె మొదల
దాని విడిపింప నశ్వరత్నమ్ముఁ బోదివె
దాని విడిపింప వెండియు దానిఁ బోదివె
చూడు వేల్పులపాటు కౌస్తుభవిభూష! 156

చం. తవిలి దశాస్యుఁ డస్మదిభదంతము కుయ్యిడగాఁ బెకల్చె దా
నవపతిసూతి సన్నాగి రణమ్మున గెల్చి ముదంబెలర్ప న
య్యవినయుఁ డింద్రజేత యను నాఖ్య వహించె నికేమి సేయుదున్
నవసినదంతికిన్ విమతనామకృతంబగు కింవదంతికిన్. 157

చం. దనుజుఁడు మేనకాది సురతామరసాక్షులఁ బిల్వఁబంచి పే
ర్చిన మధుపానజృంభణముచే దశవక్త్రములన్ గడంగి చుం
బనగతులన్ దదీయతనుపార్శ్వములన్ బలుగంట్లు సేయఁ గా
ర్కొనియెడు భీతి వానియిలుద్రొక్కరు క్రమ్మఱ నెన్ని చెప్పినన్. 158

కం. అందుకు మావెల్లేనుఁగు
బందియ వెట్టించినాఁడు పాపరతుం డీ
చందమ్మున బృందారక
బృందము త్రిదివమున నిలువరింపఁగ గలదే! 159

కం. వీరు వినుఁడు ననుబిల్చున్
వీరుఁడు రక్కసుఁడు మేషవృషణ! యహల్యా
జార! యనుచు నింద్రసునా
సీరాఖ్యలు నుడువ డపహాసింపుచు సభలోన్. 160

కం. ఆయసుర మరుత్తుని యా
గాయతనముఁ జెఱుపఁదలఁచి యత్యుగ్రుండై

డాయఁగ భీతిలు సురలకు
వాయస కృకలాస రూపవై భవ మమరెన్. 161

ఉ. రాజిలు దైత్యరాజునకు రాజు భయంపడె రాజరాజు నీ
రాజన మిచ్చె దక్షిణఁపురాజు ప్రదక్షిణ మాచరించె వా
రాజు వణంకె డొంకె ఫణిరాజు హరీ! యిఁకనేమి యే మరు
ద్రాజని కాదె రాజపదరాజికి నోటమి గల్గె నేఁటికిన్. 162

బంధుర. అమృతము ద్రావుదుఁ రమరులు సుఖులని యందురు పాపురుతాటఁ జుమీ!
విమత నిశాచర వీర శిలీముఖ విక్షపితాంగికులై విబుధుల్
నెమకుదు రద్రిగుహాగహనోదర నిర్వ్యథనాంతరముల్ గతిగా
కమలవిలోచన! విబుధవిపర్యయకార్య మవార్యమె! దేవరకున్. 163

తే. వేయునేటికి దనుజదుర్విషహదుర్వి
లాసదుష్టక్రియాపాకిలమ్ములైన
నెలవు వీక్షించఁ జనరు వేల్పులు ముకుంద!
నిన్నె కొలిచెద మిచ్చోట నిలుగు కృపను. 164

వ. అని విన్నవించు సురలను సురేంద్రుని జూచి కృపావిస్మయంబులు మనంబునఁ బెనంగొన హరి యిట్లనియె. 165

## అభయ ప్రదానము

కం. శుభమగు వెరవకుఁడిఁక మీ
కభయ మ్మిచ్చెద నిశాచరాధీశ్వరునిన్
బ్రభ చెడఁ దునుమాడెద ము
న్నిభరాజుం బ్రోచు టెఱుఁగరే! సురలారా! 166

వ. అనుచు గోవిందుఁ డందఱం దప్పకచూచి మీమీయంశంబులం గీశపతులం బుడమిం బొడముసట్లు గావింపవలయునని యానతిచ్చి విరించి నూఱడించి, రుద్రు నుల్లాసామృతసముద్రునిం జేసి, పురందరు నానందకందళితహృదయారవిందుం గావించి, తక్కటి బృందారకుల నందఱం బ్రియబంధుర మందమందసల్లాపమ్ముల ననూనయించి వారల వీడుకొల్పి యంతర్హితుండయ్యె మఱియును. 167

ఉ. అంత నిరంతరాదరితహంసరథాదిసుపర్వసంచయ
స్వాంతుఁ డుదారసద్గుణనిశాంతుఁడు శాంతజనాంతరంగవి
శ్రాంతుఁడు పుణ్యకాననవసంతుఁ డనంతుఁడు కోసలావనీ
కాంతుని కాంత నెమ్మొగము కాంతివహింప జనించు వేడుకన్. 168

సీ. పరిపంథిశస్త్రసంపాతవారణవజ్ర
పంజరమ్ములు భద్రకుంజరములు
ఉరుతరోత్సేధమంథరకుభృచ్ఛిఖరాభి
నందనంబులు ఘనస్యందనములు
నతులరింఖావిలంఘితతతాహితపురీ
కూటకంబులు నటద్ఘోటకములు
గణనీయబిరుదోగ్రరణరంగభూతలో
ద్వృత్తనృత్తార్భటుల్ వీరభటులు
తే. బలసి తనుగొల్వఁ గల్వలచెలిమికాని
కలిమి నలమిన సస్యమ్ము కరణి ధరణి
విరులు వనులందు, జనులందు సిరులు సమత
నెసఁగ దశరథభూపాలుఁ డేలునపుడు. 169

కం. అతఁ డనపత్యతఁ బాయఁగఁ
జతురగతిన్ ఋశ్యశృంగు సాహాయ్యమునన్
గ్రతు వాచరించి విప్ర
ప్రతతికి గోభూహిరణ్యరత్నము లొసఁగెన్. 170

తే. మఱియు గౌసల్య కైక సుమిత్ర లనెడి
రాజసతులకుఁ గ్రమమున రామభరతు
లోలి లక్ష్మణశత్రుఘ్ను లుదితులైరి
మంత్రపాయస భాగ సంబంధకలన. 171

సీ. మురువందు చిన్నారిమోము కస్తురిబొట్టు
శశిబింబలాంఛనచ్ఛవి వహింపఁ
దళుకుకెంజాయ కన్నులపై కనీనకల్
తమ్మిరేకుల తేటి యెమ్మె నెరప

పొలుచు గెమ్మోవిపైఁ గళలీను వలుగొనల్
చివురుపై మొగ్గల చెలువుదాల్చ
మెలఁపు చెక్కుల నవ్వుతెలివి యద్దములపై
చికిలి నిగ్గులగుంపు చెలిమిఁ జెంప

తే. గీ. మణిరుచిరకింకిణీకుణుకుణురవంబు
ఉల్లసిల బాలలీలలఁ దల్లి మ్రోలఁ
జెలఁగు రఘురాము నెలమి నీక్షించు పౌర
జనములకు నేత్రలాభమ్ము సఫలమయ్యె. 172

కం. మఱచి మరునాకనిఁ బిల్తురె
మఱి నూర్వుర వలయు రూపమహిమ నతనికిన్
దఱచి విధు నెన్నవచ్చునె
మఱి నూర్వుర వలయు రసనమంచితరుచికిన్. 173

కం. ఆటలవేళన దోర్బల
పాటవ మెల్లరు భజింపఁ బటువిశిఖమునన్
కాటుకప్రోవుం బోలిన
తాటకఁ బడనేసె గాధితనయుం డలుకన్. 174

ఉ. ఖేచరులై నిశాచరులు కిల్బిషవృత్తి మునిప్రణీత యా
గాచరణాంతరాయకరులౌట వెసంగని వారి ఘోరనా
రాచపరంపరం బొలుపఱం దునుమాడి కువాచు నీచు మా
రీచుఁ బయోధివీచికల క్రేవలఁ ద్రోఁచె మరుచ్ఛరమ్మునన్. 175

సీ. వదనసరోరుహరజఃపటలైకలేశాను
భూతిచే నాగి రాతి నాతిఁ జేసె
కరపల్లవాగ్రప్రకర్షణాకర్షణ
పెల్లుచే హరువిల్లుఁ బొల్లుచేసె
ప్రకటవైభవముచే సకలాస్త్రదేవతా
ప్రతతుల నిజదాస్యరతులఁ జేసె
మృదురూపమహిమచే మిథిలేంద్రకన్యాల
లామంబు దనకు నిల్లాలిఁ జేసె

తే. గీ. బలసమగ్రత నెదిరించు భార్గవునకుఁ
దనదు ప్రేఁగంటఁ బొడము కెందళుకుఁ జూపి
మున్నతఁడు రాచవేఁటఁ గైకొన్న నాఁటి
సా మొదలఁ జేసె భుజశక్తి సాము జేసి. 176

కం. సాకేతనగరమున ల
క్ష్మీకాంతుం డిట్లు జానకీవిభుఁడన మ
ర్త్యాకల్పుఁడయ్యెసుజనే
హాకల్పుండగుచుఁ గీర్తి యాకల్పముగన్. 177

ఆ. వె. అంత దశరథేశుఁ డగ్రనందనునకు
యౌవరాజ్య మొసఁగ నాత్మఁ దలఁపఁ
గినిసి దుర్వివేక కేకయరాజకు
మారి పతిహితమ్ము గోరదయ్యె. 178

కం. నరవర! మును నీవొసఁగిన
వరములు మఱచితివె! రాజ్యవైభవలీలా
భరితుని భరతునిఁ జేయుము
భరతాగ్రజుఁ దపసిఁ జేసి పంపు మడవికిన్. 179

## శ్రీరాముని యరణ్య గమనము

తే. గీ. అనుచు నిబ్బంగి కేకయతనయ పలుకు
పలుకుల విధం బెఱింగియుఁ బంక్తిరథుఁడు
ద్రోయఁజాలక శుభకాము రుచిరసుగుణ
ధాము రఘురాముఁ ద్రోఁచెఁ గాంతారములకు. 180

కవిరాజ. వెలవెలనై రవిచంద్రుల యాదము వేఱొకచందమునన్ దనరన్
దలకొను నుమ్మలికమ్ములు దమచిత్తములం గ్రమ్మ జనమ్ములు సం
కులత నెసంగి ప్రసంగ మొనర్పఁ గకుత్స్థకులాగ్రణి డెందమునన్
దలఁకక నేగె వధూమణితోఁ దనతమ్మునితో నడిదమ్ములతోన్. 181

సీ. పలుకులచెలి తేనె బహుజగద్భర్తగాఁ
బలికి నేఁటికి నొండు పలుకఁడయ్యె
నడుగుదమ్ముల జగంబంది యన్నకు నిచ్చి
యడుగు దమ్ములరీతి నడుగఁడయ్యె
నరి గోరుల వధించి ధర బాలునకొసంగి
యరిగోరు లేవంచు నాడఁడయ్యె
జవి, చూచు దేవతాసంఘమ్మున కొసంగి
చవిచూచు నేడుక సలుపఁడయ్యె

తే. సమ్మహాత్ముఁడు నిఖిలవేధోండభర్త
రక్తిఁ జెందునె కోసలరాజ్యమునకు!
లోకహింసకవిద్విషల్లోకదళన
విక్రమకీడ మదిఁబూని వెడలుఁగాని. 182

ఉ. రాజకులావతంసమగు రామవిభుండు గుహానువృత్తి గం
గాజలపూరమున్ గడచి గాఢలతాపిహితద్రుమావళీ
భాజనదుర్గమాటవులఁ బత్నియుఁ దమ్ముఁడు దోడరా భర
ద్వాజుని యాజ్ఞఁ జెందె మదవారణకూటము చిత్రకూటమున్. 183

తే. గీ. అంత భరతుండు చిత్రకూటాద్రి కరిగి
సారెఁ బ్రార్థించి పలుక రాజ్యంబు సేయ
మరుల దొరలక నాతని మఱలఁ బనిచె
నదిగదా! నిత్యసత్య సంవిదులరీతి. 184

సీ. విస్ఫురత్కటతటీవిగళన్మదోదగ్ర
కుంభిశుంభద్ఘటాకోటి విడిచి
సముదితధ్వజపటాంచలమరుద్ధుతఘనా
ఘనఘనోన్నతశతాంగముల విడిచి
చటులచంక్రమణవీక్షణభీతపరిపంథి
సంఘతుంగతరంగసమితి విడిచి
బహువిధాయుధపరిభ్రమణకేళీకట
త్పటుమదోద్భటవీరభటుల విడిచి

తే. గీ. రామభద్రుండు విహరించె భీమసింహ
శరభశార్దూలభల్లూకచమరశల్య
గండభేరుండకాసరఖడ్గగవయ
దంతిముఖజంతుఘోరకాంతారములను. 185

కం. అవిరళవిక్రముఁడు రఘు
ప్రవరుం డయ్యడవి నుగ్రభంగి వధించెన్
దివిషన్నిరోధు భైరవ
రవరూఢక్రోధు సాపరాధు విరాధున్. 186

కం. ఈలీల మదిని మునిపరి
పాలనతత్పరత నవ్విభావసువంశ
శ్రీలుం డరిగెన్ వ్యాఘ్ర
వ్యాళమృగార్భటికిఁ బంచవటి చక్కటికిన్. 187

తే. గీ. అమ్మహాటవి శూర్పణఖాభిధాన
దానవీమర్త్యధానప్రధానవచన
సూచితక్రూరతాసహిష్ణుత నతండు
జేసెఁ దత్కర్ణనాసవిచ్ఛేద మపుడు. 188

కం. ముక్కును జెవులును బోయిన
రక్కసి మొఱలిడుచుఁ జని ఖరప్రభృతులతో
నక్కార్యం బెఱిఁగించిన
నక్కను రోషమున రాము నిర్జించుటకున్. 189

తే. గీ. ఆగరిత జాగరితయగు నమ్మహాత్ము
నాత్మమాయల బెదరింప నలవిగాక
రుధిరపూరమ్ము సెవినిండి బధిరఁ జేయ
దీనగతి నేగె నజ్జనస్థానమునకు. 190

సీ. మందరాచలనిభస్యందనారూఢుఁడై
భాసురుండైన ఖరాసురుండు
పటురణోత్సాహసంభరితుఁడై ధృతధను
ర్లస్తకుండైన త్రిమస్తకుండు

లితసింహఘోషదుర్దాంతుఁడై కృతమరు
త్కంపనుండైన యకంపనుండు
భూరిదోస్సారప్రభూతగర్వక్రూర
భాషణుండై పేర్చు దూషణుండు

తే. గీ. దర్పమదవిస్ఫురచ్చతుర్దశసహస్ర
దనుజభటపంక్తి నడుమ నుద్ధతి యెసంగఁ
జనిరి రఘుకులసార్వభౌముని జయింతు
మనుతలంపు నిలింపుల కసము బెంప. 191

కం. అది చూచి రాఘవుండ
భ్యుదితోగ్రక్రోధశిఖిశిఖోజ్జ్వలనిశిత
ప్రదరాస్త్రధనుర్ధరుఁడై
యెదురేగెన్ దనుజపీంహింసాకృతికిన్. 192

మత్తకోకిల. ముంచె నుగ్రశరాగ్నికీలల మోహరించు భటావలిన్
ద్రుంచె ఘోరశిలీముఖమ్ముల దూషణున్ ద్రిశిరున్ మహో
దంచితాస్త్రముల న్వధించె ఖరాసురున్ బ్రియమంది భూ
షించె దేవగణమ్ము లారఘుశేఖరున్ గుణసాగరున్. 193

చం. అదివిని జాతరోషభయదాకృతియై దశకంధరుండు దు
ర్మదమున మాయఁపుంబసిఁడిమైగలలేడివి గమ్ము రాఘవుం
డుదితసతీనియుక్తి నిను నాయ్యనఁ గైకొన నేగుదెంచు న
య్యదనున సుందనందన'నృపాంగనఁ గైకొని తెత్తు లంకకున్. 194

వ. అనుచు మారీచుం బుత్తెంచిన నతండును హేమకురంగరూపధరుండై స్వాశ్రమసమీపవర్తియగుటయు. 195

కం. చంచద్రత్నకురంగో
దంచితరూపమ్ము గని ధరాత్మజ వేడ్కన్
బంచాశుగనిభు విభుఁ బ్రా
ర్థించెన్ గాంచనమృగమ్ము దెమ్మని వేగన్. 196

## సీతాపహరణము

ఉ. ద్యోతితశౌర్యుఁ డారఘుకులోత్తముఁ డట్లు మృగానుసారియై
యాతతవృత్తి నేఁగఁగ దశాస్యుఁడు భవ్యకులాభిజాత ని
ర్ణీతపతివ్రతాచరితనీత సుధీజనగీత సద్గుణ
వ్రాతసమేత సీతఁ గొనివచ్చె జటాయువుఁగూల్చి లంకకున్. 197

ఉ. శంకితమానసుండగుచు జానకిఁ గైకొని రావణుండు దా
లంకకు నేఁగె భాస్కరకులప్రవరుండును హేమరత్నచి
త్రాంకమృగాకృతిం జను నిశాటు వధించి నిజాశ్రమంబు ని
ర్వంకల నింతిగానక దురత్యయఖేదపరీతమూర్తియై. 198

కం. దనుజకరఖడ్గవిదళిత
తనుపక్షిగణబలు పతంగాధ్యక్షున్
గని కనికరమున రఘునం
దనుఁ డిచ్చెన్ మెచ్చి యచ్యుతంబగు పదమున్. 199

కం. క్రౌంచారణ్యమ్మున నృప
పంచానను లాగ్రహించి బాహాయుగమున్
ద్రుంచి పడవైచి రురుమృగ
పంచజనాద్యంధు దురితబంధు కబంధున్. 200

కం. ఎలమిఁ గబంధుఁడు దమకున్
దెలిపినగతి నేఁగి కనిరి దీపితపంపా
సలిలాశయ తటతరుసుమ
కలిత రజఃపటలజటిలకబరిన్ శబరిన్. 201

వ. అంత నత్యంతసంతుష్టాంతరంగయగుచయ్యుత్కుటజంతి సేవంతిసీలతాం తంబులఁ బ్రఫుల్లమల్లికాకుసుమదామస్తోమంబుల మాలతీప్రసవమాలికల సుకరంబు లగువకుళముకుళంబుల మఱియు ననేకవిధార్ఘ్యంబులం బూజించి సుధామధుర ఫలవిశేషంబులు సమర్పించి కృతార్థయైయున్న యన్నాతికిం బ్రీతియెసంగ దివ్య పదం బొసంగి తమవదిష్టప్రకారంబున సుగ్రీవుం జూచువారై చనిచని ముందట. 202

సీ. తటసరద్గజఘటాఘటిత మేఘాళిశో
త్కంఠానటన్నీలకంఠచయము
స్ఫటికాశ్మబింబితస్వతనువీక్షాన్యధీ
వైరసంఘుష్టకంఠీరవమ్ము
సానుసన్నిహితేందుసందర్శనాసీత
ఫలమనీషోత్పతద్వానరమ్ము
ఘనవిదూరజశిలేశుణజాఘుభుగ్భీతి
కేకరీకృతకోకకోకిలమ్ము

తే. గీ. సైరిభద్వంద్వ కలహప్రసంగ శృంగ
చిటచిట రవోపగత వేణుపటల దావ
బహుళశబ్ద భ్రమద్భ్రమద్బహుళమృగ ని
కాయమగు ఋశ్యమూకంబు గానఁబడియె. 203

## సుగ్రీవ సమాగమము

కం. కనుగొని యటఁగ్రుమ్మరు స
మ్మనుజేంద్రాత్మజులఁ జూచి మదిఁ బెగడుచు న
య్యినతనయుఁ డనుపఁ బావని
చని వారి తెఱంగెఱింగి సంతుష్టుండై. 204

తే. గీ. స క్తసాంకవమృగమదస్ఫటికతటుల
నడుగులిడఁ గష్టమగునంచు హనుమ వగచి
తనభుజమ్ములనిడుకొని దశరథేంద్ర
సుతులఁ గొనివచ్చె మార్తాండసుతుని కడకు. 205

తే. గీ. అంత నిరువురు సఖ్యసౌఖ్యమ్ము నంది
వెలయ సుగ్రీవుఁ డవనిజ వెదకు పనికి,
సరవి రఘువల్లభుఁడు వాలిఁ జంపుటకును
శపథములు జేసి రపు డగ్నిసాక్షికముగ. 206

కం. లీలఁ దళుకొత్త రాముఁడు
మేలగుబలువింటఁ దొడిగి మిడుగురులడరన్

వాలికతూఁ పెద నాఁటిన
వాలి వెసన్ దూలి తూలి వ్రాలెన్ బుడమిన్. 207

ఉ. అంత ననంత తేజుఁడగు నమ్మనుజేంద్రతనూజుఁ డబ్జినీ
కాంతునిపట్టికిన్ బ్లవగగౌరవరాజ్యమొసంగినన్ శుచి
స్వాంతుఁ డతం డగణ్యమగు వానరసైన్యములన్ సమస్తది
క్ప్రాంతములందు సీతవెదుకం బనిచెన్ బ్రతికారశీలుడై. 208

వ. ఇవ్విధంబున నవ్వసుధాకన్యాన్వేషణమ్మునకు ననన్యసామాన్యబలోదీర్ణమ్ములగు సైన్యమ్ముల నలుగడలకుం బనిచి హనుమదంగదజాంబవన్నీలనల ప్రభృతులగు కపిప్రవరుల ననేకవీరవానరానీకంబులతోడం బనిచిన వారును దక్షిణ దిశావలయమ్ము కలయంబరికించి పదంపడి సంపాతివచనంబులవలనరావణానీతయై సీతాదేవి లంకాపురంబున నుండుటయెఱింగి పరితోషమ్మునం బొంగు నంతరంగమ్ములతోఁ జనిచని ముందట. 209

స్రగ్ధర. అభ్యస్తోదగ్ర వేగవ్యవసిత మకరవ్యాళి పాఠీనధాటీ
క్షుభ్యత్క్షుద్రాండజంబై సురనికర మనస్తోషకృద్రత్నదంబై
బిభ్యద్వైమానికస్త్రీ పృథుకుచ పరిరంభీకృతోరఃప్రియంబై
యభ్యుద్యత్తుంగ భంగాహతఘనతటమై యబ్ధి గానంగ నయ్యెన్. 210

కం. చూచి వెతఁజెంది తొల్లిఁటి
వాచాలత యుడిగి రిచ్చపడిరి కపులు కా
లోచిత మెఱింగి పావని
ఖేచరగతి నడువ నుత్సుకితమానసుఁడై. 211

## హనుమ సముద్రమునుదాఁటి సీతఁగనుగొనుట

సీ. చూచినచూపులు సురవైరిపురగోపు
రాట్టాలకమ్ముల నదరఁజేయ
చాచినహస్తముల్ సమదవైమానిక
ప్రకరమ్ము నిట్టట్టు పరవఁజేయ
పూఁచినపదములు భుజగరాజస్ఫటా
తతులకు దుస్సహత్వమ్ముఁ జేయ

వీచినవాలమ్మున విపులదిశాగజ
శ్రేణికి గుండియల్ చెదరఁజేయ

తే. గీ. అచల మల్లలనాడ విహంగరాజ
గతి నెగసి లీలఁ దళుకొత్త గగనవీథి
నరుగఁ దొడఁగె నవక్రపరాక్రమప్ర
చండవైఖరి నన్నభస్వత్సుతుండు. 212

మ. చని యాతండు తమస్వినీసమయసంచారోన్ముఖుండై పురా
తనలంకాపుర గోపురావసథ సౌధస్ఫారశాలా వినూ
తనపుష్పావృత పుష్పకప్రతనరత్నగ్రావముల్ రోసి పూ
నిన చింతన్ నృపచంద్రచంద్రముఖి నన్వేషించె జాగ్రద్గతిన్. 213

కం. మొనసి పురియరసి కానక
పనివడి క్రమ్మఱఁ దలంచె పావని కులపా
వని వనితామణి జనకా
వనిపాలతనూజ కింకవని తావని తాఁ. 214

కం. అనిలాత్మజుఁ డవ్వనమున
పనివడి వెదుకంగ శింశుపాతరుమూలం
బునఁ గృశత దోఁప చింతా
తినతాననయైన రాముదేవిం గనియెఁ. 215

తే. గీ. కాంచికోదండచదవలగ్న కాంచనాంగి
కాంచి కపి కార్యసిద్ధి యూహించి పొంగె
భంగసంఘాతసంచారభంగిఁ గ్రుంగి
చంద్రకళఁ గాంచి పొంగిన జలధివోలె. 216

వ. ఇక్కరణి నక్కపికుంజరుండు నిశాచరచరిష్యమాణంబగు నవ్వన మధ్యంబునఁదనుమధ్యం జూచి పతివిరహజనిత చింతాపరిశ్రాంతస్వాంతయు నుపవాస కృశాంగియు నగు నన్నలినలోచన చిత్తంబు రామలక్ష్మణక్షేమకథాకలితంబులగు సాంత్వవచనంబుల నుపశమిల్లంజేసి రాఘవాంగుళీయకం బమ్మధురభాషిణికి నభిజ్ఞానమ్ముగా నొసంగి సంతోషరసతరంగితాంతరంగం గావించి పునఃప్రయాణోన్ముఖుండగుచు నద్దేవిచేత ననుజ్ఞాతుండై యచ్చోటుగదలిచని. 217

తే. గీ. చంపకాశోక సహకార చందనాది
బహుళతరు ఫలపుష్పసంపదల నొప్పు
ప్రమదవనమెల్ల నిర్ఘాతపాతఘోష
భీషణమ్ముగ విఱిచె నా భీమబలుఁడు. 218

శా. నిస్త్రింశాదిసమస్తసాధనకళాన్వీతుల్ నిశాటుల్ సమి
న్నిస్త్రాసుల్ పొదువం గపీంద్రుఁడు గదానిర్ఘాతపాతమ్ములన్
భస్త్రాజాలము భంగిఁ బ్రోవులుగ గూల్పన్ మేఘనాదుండు బ్ర
హ్మాస్త్రం బేసి నిబద్ధుఁ జేసి వెసఁ బిత్రావాసముఁ జేర్చినన్. 219

తే. గీ. అతఁడు రోషారుణాక్షుఁడై యనిలతనయు
వాలమునఁ దైలసంసిక్తవస్త్రచయము
జుట్టి కాల్పింపఁ బంచిన సురవిరోధు
లట్లకావించి రత్యుగ్రులై కడంగి. 220

లంకాదహనము

చం పవనజుఁ డంత రజ్జుకృతబంధనముల్ విదిలించి వైచి వా
ల విపులఘోరవహ్నిశిఖలన్ దరికొల్పి సుశాలిశాలికా
సవనికయ స్ఫురద్విపణిసద్మవిభూషణవస్త్రపేటికా
భవన విచిత్రమంటప సభానిచయమ్ము దహించె నుగ్రుఁడై. 221

చం. దెసలఁ బఱ స్ఫులింగములు దీటుకొనన్ గపివాలకీలిచేఁ
బసిఁడికవాటముల్ గరఁగిపాఱె మణిచ్ఛట గ్రాఁగి వ్రక్కలై
వసుమతిఁ గూలె సౌధరుచివైఖరి తీఱె రవమ్ముమీఱె రా
క్షసవనితాశ్రుబిందువులు జాఱె కనుంగవ నిండ్రకేవలన్. 222

తే. గీ. జృంభదతికాయ కుంభ నికుంభ కుంభ
కర్ణ ధూమ్రాక్ష మత్తశుక ప్రహస్త
జిష్ణుజిన్ముఖ్యమందిరశ్రేణి దవిలి
లోఁకచిచ్చయ్యె హనుమంతు తోఁకచిచ్చు. 223

వ. ఇవ్విధంబునఁ బ్రళయసమయ విజృంభితతాండవప్రచండమూర్తియగు రుద్రునిచందంబున సకలదనుజభయంకరాకారుండగుచు లంకాపురీదహనం బాచరించి యుపశమితక్రోధుండై కీలికీలాభీలంబగు వాలంబు సముద్రసలిలంబులం జల్లార్చి రామపత్నిం గాంచి ప్రణామంబు లాచరించి యద్దేవిచేత ననుజ్ఞాతుండై సముద్రంబు గడచి వాలితనయజాంబవత్ప్రముఖులం గూడికొని చని లక్ష్మణసుగ్రీవసహితుండై యున్న యన్నృపశిఖామణి చరణంబులకుం బ్రణామంబు లాచరించి సీతావృత్తాంతం బంతయు నెఱింగించిన నమ్మహాబాహుండు కపిగోలాంగూలభల్లూకసైన్యంబులు పరివేష్టింప భేరీభాంకారనిర్దళిత దిశాభాగుండగుచు సత్వరప్రయాణమ్ముల సాగరసమీపంబునకుం జని చమూసమావృతుండై యచట నిలిచియున్నంత. 224

కం. అగ్రజుఁడు రావణునిచే
విగ్రహముం జెంది యలవిభీషణుఁ డపుడ
వ్యగ్రమతి నేగి రఘువీ
రాగ్రణి కృపఁ జెంది నిలిచె ననుచరుఁ డగుటన్. 225

చం. నరవరుఁ డంత దర్భశయనవ్రతియై తను వేడుచున్న, ము
ష్కరమతియై సముద్రుఁడు ప్రసన్నుఁడుగామి నతిప్రచండని
ష్ఠురభయదాకృతిన్ ధనువుఁ జొప్పడఁ దాల్చి మహానలజ్వల
చ్ఛరనికరంబు పైఁ బఱపె సాగరనీరము నింకఁ బాఱఁగన్. 226

సీ. ఉడుకునీట వసింపనోడి గ్రక్కున దీవి
మేటల నలరు తామేటికులము
శరధూమవిసరధూసరవహ్నికీలలఁ
జెదరి శోషిలుచుండు చిలువపిండు
తూఁపుటగ్గుల కాఁకదొరలి తూలింపంగఁ
దెరలుచుఁ బెన్నీటఁ దేలుమీలు
విశిఖానలోష్మదుర్విషహమై క్రమ్మిన
మినుకజాలక త్రెళ్లు పెనుమొసళ్లు

తే. గీ. నగుచుఁ గంధిజలమ్ము లుగ్రాస్త్రశిఖికి
నింధనము లయ్యె దనుజసంబంధ మింత
జేసె నను భూనభశ్చరశ్రేణి ఘోష
మెల్లెడలఁ బర్వె సాగరం బింకఁదొడఁగె. 227

ఉ. అంత దురంతరోషచరణారుణలోచనుఁడైన జానకీ
కాంతుఁడు ప్రజ్వలజ్జ్వలనకాండము మౌర్వి టింప ఘోరక
ల్పాంతవిజృంభితార్కనిభమౌట సముద్రుఁడు భీతుఁడై జలా
భ్యంతరసీమ వెల్వడి నృపాగ్రణిఁ గొల్వఁగవచ్చె నమ్ముఁడై. 228

కం. నిరహంకృతి నతఁ డారఘు
వరుని న్వినుతించి కరుణవడసి సరస్వ
త్తరణమ్ము సేతుబంధో
ద్ధరణమ్మున నగునటంచుఁ దగఁ బల్కుటయున్. 229

వ. అట్లకాక యని తదాదేశప్రకారంబున ననేకప్లవంగపుంగవానీతంబులగు శైలసాలశిలాజాతంబుల సేతుబంధంబుల సలకర్తృకంబును శతయోజనపరిమితంబును నై విలసిల్లె నంత రామభద్రుండు లక్ష్మణసుగ్రీవహనుమద్విభీషణాంగదజాంబవన్నలనీలాదివీరభట పరివారంబు గొలువ సముద్రతరణంబు జేసి చని ప్రచండాట్టహాసగర్జారవఘోరమ్ముగా లంకాపురద్వారనిరోధంబు జేసినం గుపితులగు నిశాచరవరులు కయ్యమ్ము సేయ వెడలిన. 230

## యుద్ధము

మ. అమితోత్సాహులు భానుజాంగద జగత్ప్రాణాత్మజుల్ జాంబవ
త్ప్రముఖుల్ మర్కటభల్లుకాధిపులు ధూమ్రాక్షప్రహస్తప్రజం
ఘ మహాపార్శ్వ నికుంభ కుంభముఖ విఖ్యాతాసురశ్రేణులన్
సమరక్షోణి వధించి రుజ్జ్వలభుజాసరంభదుర్వారులై. 231

తే. గీ. మేరుసమభీమకాయు నమేయబల వి
జృంభణోదీర్ణ శిఖవర్ణు కుంభకర్ణు
చండకోదండముక్తార్ధచంద్రవిశిఖ
నిహతిఁ దునుమాడె రామావనీవిభుండు. 232

మ. ఉరులంకాపురవజ్రపంజరము మాయోపాయమంజూష యు
ద్ధురగర్వాంధతమోద్రిగహ్వరము వేధోదత్తదివ్యాశుగా
కర మితండన నొప్పు నింద్రజిదభిఖ్యాతాసురుం దాఁకి దు
ర్భరబాణాహతిఁ ద్రుంచె నొక్కట సుమిత్రాపుత్రుఁ డవ్యగ్రుఁడై. 233

కం. దనుజేంద్రుఁ డంతయును విని
ఘనశోక ద్వేషరసవికారోద్ధతుఁడై
యినవంశవర్యుఁ దొడరుదు
నని సూతుంబనిచె రథముదగ్రతఁ దేఁజన్. 234

సీ. ప్రకటభల్లూక చర్మస్యూతషోడశ
చక్ర చంక్రమ చలత్క్ష్మాతలంబు
యుగభారసహవేగయుక్తురంగసహస్ర
ఖురఘాత ధూళిసంకుల నభంబు
వితతాంగ దారులంబిత ఘంటికాజాల
ఘోష కాతరదిశాకుంజరమ్ము
చటులరత్నప్రభా సంవృతధ్వజపటీ
రచిత గృధ్రవిహంగ రాజితమ్ము

తే. గీ. శరగదా కుంతకోదండ శక్తిపరశు
ఖడ్గ ముఖ్యాయుధోగ్రంబు కాలకేతు
సూతచోదిత మగుచుఁ బ్రఖ్యాతమైన
ఘనరథంబెక్కి వెడలె రాక్షసవిభుండు. 235

వ. ఇట్లు వెడలి రావణుండు ప్రచండకాండపరంపగలం బ్లవంగపుంగవులం దొలంగిపరవం జేయుచు రామభద్రుందరిసిన నమ్మహాబాహుండును బురుహూత ప్రేషితంబును మాతలిసూతసహితంబును నగుస్యందనంబెక్కి రక్కసువెసందారొఁని కయ్యంబుజేసె నప్పుడు. 236

చం. అపుడు రఘూద్వహుండును దశాననుఁడున్ బరగించుఁ దూఁపు ల
ట్లపరిమితంబులై దెసలు నాకసమున్ వెసఁ గ్రమ్మి నట్టిచో
నృపమణి యుగ్రలీల రజనీచరవల్లభు మస్తకంబులున్
విపులభుజంబులుం దునిమె వే మొలువం దునుమాడె సాగసన్. 237

## రావణ వధ

తే. గీ. అంత రఘువీరుఁ డత్యుగ్రుఁడగుచు బ్రాహ్మ
ణాస్త్ర మడరించి వజ్రవణాంకమైన

రక్కసులఱేని వక్షమ్ము వ్రక్కలింప
నసువులెడలిన గిరివోలె వసని వ్రాలె. 238

వ. ఇవ్విధంబున దశవదను వధియించి రామచంద్రుండు సర్వసుపర్వగణ మధ్యంబున వెలుంగు మహేంద్రునిచందంబున సకలకపిసేనామధ్యంబునం దేజరిల్లుచున్నంత లక్ష్మణసుగ్రీవ హనుమదంగదాది కపివీరు లమ్మహాత్మునకుం బ్రణామమ్ము లాచరించియభినందించి రప్పుడు. 239

సీ. కురిసె రాఘవునిపైఁ గోమలమందార
సుమసముంచితమైన సోనవాన
మొరసె నొక్కట నవాంబుద గభీరధ్వాన
తులితమై దివ్యదుందుభి రవంబు
మెఱసె నంబరవీథి మృదులాప్సరోగణ
సంగీతనాట్య ప్రసంగసరణి
వీసె నల్లనఁ బద్మినీసూన చయనీతి
సౌరభంబగు దివ్యమారుతంబు
తే. గీ. సురలవినుతులు మునివరస్తుతులు మర్క
టోత్తమస్తోత్రములు కిన్నరోరగేంద్ర
సిద్ధయక్షస్తవంబులు చెలఁగె దిశల
జానకీజాని విజయావసరమునందు. 240

సీ. ఇందీవరార్ధేందు కుందబింబోడు స
న్నయనఫాల రదోష్ఠ నఖరనిచయ
కలశ కేసరి శంఖకలహంస ఘనతుల్య
కుచమధ్య గళయాన కచవిలాస
స్మరధనుఃకరభ చంపకతటిన్ముకుర సు
భ్రూరునాసాంగ కపోలఫలక
యావర్తబిసకాహళాంబుజశ్రీ సము
ద్యన్నాభిబాహు జంఘాంఘ్రి కర్ణ
తే. గీ. సీత సద్గుణసంఘాత శిఖిముఖంబు
వెడలి సితచేలచందనవిమలకుసుమ
రాజి రాజితమూర్తియై రామవిభుని
శోభితోత్సంగపీఠిఁ గూర్చుండె నపుడు. 241

కం. పూజ్యయశోనిధి రాముఁడు
ప్రాజ్యగుణు విభీషణునిఁ గృపన్ బహులీలా
భోజ్యంబగు లంకాపుర
రాజ్యరమావిభవమునకు రాజుం జేసెన్. 242

వ. అయ్యవసరమ్మున. 243

సీ. మంచువేలుపు చాయ లెంచి మెచ్చనికాంతి
మించి రాణించు రాయంచ నెక్కి
కొమ్మజమ్ముల బొమ్మగ్రుడ్డు జీరలువాఱఁ
గ త్తరించిన మేటిగిత్త నెక్కి
నడల నచ్చరబోంట్ల కడుప్రీడ నొందింప
రంగారు మదపుటేనుంగు నెక్కి
రతనంపుజతల దీధితులెల్లెడలఁ బర్వ
మానితంబైన విమాన మెక్కి

ఆ. వె. పద్మసంభవుండు ఫాలేక్షణుండు సు
రేశ్వరుండు దశరథేశ్వరుండు
సకలవిబుధవరులు జనుదెఱ నేతెంచి
రోలి రామచంద్రుపాలి కపుడు. 244

కం. ఊర్జితవాచారచనల
నిర్జితరిపురాముఁ బొగడి నెరి ననురేఖా
వర్జితులగు వానరుల పు
నర్జీవితులుగ నొనర్చి నయ మెసలారన్. 245

వ. మఱియును దగువరమ్ములొసంగి నిజనివాసంబులకుం జనిరంత రామభద్రుండును జానకీలక్ష్మణసమేతుండగుచుఁ బుష్పకాధిరూఢుండై విభీషణసుగ్రీవహనుమదంగదప్రభృతులగు ప్రధానవరులు సపరివారమ్ముగాఁ దన్నుఁ గొలిచిరా సాకేతపురసమీపమ్మునకుం జనునప్పుడు భరతుండంతయు విని మహానందభరితాంతఃకరణుండై కౌసల్యాదిజననీచయంబును వశిష్ఠప్రభృతిగురువర్గంబును సుమంత్రప్రభృతిమంత్రిసంఘంబులును సమస్తపౌరజనంబులునుం బరివేష్టింపం జని యగ్రజు నెదుర్కొని. 246

కం. తాఁ దలనిడుకొని భరతుఁడు
మోదమ్మునఁ దెచ్చి మణిసముజ్జ్వలవిలస
త్పాదుకలు రామభద్రుని
పాదమ్ములఁదొడిగి మ్రొక్కె బహువారమ్ముల్. 247

కం. జననీగురుభూసురవం
దనములు గావించి సచివనాగరజనులన్
వినయోక్తుల నలరింపుచు
నినవంశ పయోధిచంద్రుఁడేగెన్ బురికిన్. 248

## అయోధ్యా ప్రవేశము

తే. గీ. జడలువిడిపించి మంగళస్నానములఁ
జేసి రుచిరాంబరంబులఁ జిత్రరత్న
భూషణమ్ముల స్రగ్గంధపుంజముల న
లంకరించిరి వెసరామలక్ష్మణులను. 249

సీ. శ్రీరామభద్రాభిషేకోత్సవంబు ని
ష్ప్రత్యూహ మగునంచు, శాకునికులు
సముదగ్రజలధరస్వన సముద్ధ్వనికరో
దారాహతులఁజూపు వారారజికులు
తత ముఖానిలసముద్ధతఘుళంఘుళ ఘోష
కలన నేర్పులు జూపు కాంబలికులు
షడ్జాది బహువిధస్వరమిళన్మాధురీ
వైఖరుల్ గావించు వైణవికులు

తే. గీ. స్వస్తివాచన ముఖరద్విజవ్రజంబు
జయజయార్భటి వందిసంచయము వొగడ
రుచిరకాంచనమయ రథారూఢుఁ డగుచు
రామచంద్రుం డయోధ్యాపురంబు సొచ్చె. 250

వ. తదనంతరంబ. 251

కం. చంచన్మణిఘృణి విలస
త్కాంచనపీఠమున జనకకన్యకతో స
క్తంచరవైరి రఘూద్వహుఁ
డంచితగతి నొప్పుచుండె నార్యులు పొగడన్ 252

## శ్రీరామాభిషేకము

మ. కపిముఖ్యుల్ చతురబ్ధితోయముల వేడ్కం దేర సమ్యక్సుధీ
సపదిప్రోత్సహనమ్మునన్ జని యుదంచత్స్వర్ణకుంభమ్ములన్
నిపుణప్రక్రియఁ దెచ్చినన్ ముదముసంధిల్లన్ ద్విజవ్రాత మం
త్రి పురోధస్సుహృదాప్తవర్గము బలశ్రీమన్మహూర్తమ్మునన్. 253

తే. గీ. అమలమణిమయసింహాసనమున జనక
జనవరాత్మజతో రామచంద్రు నునిచి
మహితపుణ్యోదకంబుల మంత్రరచన
వెలయ నభిషిక్తుఁ జేసిరి విప్రవరులు. 254

కవిరాజ. బలిమి చెలంగ నితండు ఘనుండని పల్కు నిలింపుల మాటలతో
నలరుచు గీతుల రీతులఁ దేలెడి యచ్చరబోటుల యాటలతో
పలుగడలన్ జయమంగళమే యను పాటలగంధుల పాటలతో
నలరె రఘూద్వహు నయ్యభిషేచన మన్నరవానర కోటులతో. 255

మ. మరుదీశుం డురుపారిజాత సుమదామంబుల్ కనద్రత్నసుం
దర కేయూరము లర్యమాత్మజుఁడు చంద్రద్యోతిహారాళి శం
బరనాథుం డనిలుండు కుండలము లింపారం గిరీటంబు కి
న్నరపాలుండు నొసంగి రవ్విభునకున్ మంజుక్రియాధుర్యులై. 256

తే. గీ. జలనిధులు పొంగె దివిమ్రోగె సాధువాద
మవనిసురసౌఖ్యము పొసంగె నఘముగ్రుంగె
పుణ్యములెసంగె విమతుల పొలుపుద్రుంగె
రామభద్రుండు రాజ్యాభిరతి వహింప. 257

వ. ఇవ్విధంబున రామచంద్రుడు సామంతమంత్రి పురోహితగోభూసుర సమూహానందసంధాయకుండగుచు లక్ష్మణభరతశత్రుఘ్న హనుమత్సుగ్రీవప్రముఖానుజసుహృత్ప్రియజనంబుగొలువ పదునొకండు వేలయేండ్లు రాజ్యమ్ముంజేసి శ్రీమన్నారాయణలక్షణలక్షితంబైన నిజరూపంబుధరియించి గరుడవాహనారూఢుండై పరమస్థానంబునకుం జనియె భూవల్లభా! ఇట్టి శ్రీరామచరిత్రంబు వల్మీకసంభవ ప్రోక్తంబునుగాయత్రీవర్ణాత్మకంబును నుభయలోకసౌఖ్యసంధాయకంబునునగుటం జేసి యిప్పుణ్యచరితంబు భాగవతోత్తమునిచే నాకర్ణింపుచున్ గాలక్షేపంబు సేయుమనిచెప్పి యప్పుడమితేని నామంత్రితుం జేసి నిజేచ్ఛంజనియె ననిచెప్పిన శిష్యప్రవరు లయ్యాచార్యుంజూచి యవ్వలివృత్తాంతం బెట్టిదని యడిగిన. 258

మ. జనకక్ష్మావరకన్యకాముఖసరోజాతార్క! శక్రాదిదే
వనికాయాపదపాయహేతుకరభాస్వచ్ఛండకోదండము
క్తనిశాతాశుగ భిన్నదైత్య గళరక్త ప్లావితోగ్రాహవా
వనిభాగా!మదరాగశూన్య ఘనవిద్వద్వేద్య తత్త్వోజ్జ్వలా! 259

కం. ధీరజనోద్ధార! మహో
దారగుణాధార! సారతరవిద్యావి
స్తార! సితఖడ్గధారా
దారితమాద్యత్కబంధదైతేయకరా! 260

మాలిని. శరవిహతవిరాధా! సద్ధితాత్మీయబోధా!
సురుచిరశుభదాయీ! శూరలోకాగ్రయాయీ!
సరసిజదళనేత్రా! చంద్రబింబాభవక్త్రా!
సురహితజయభద్రా! శోషితాంభస్సముద్రా! 261

వ. ఇది శ్రీరామచంద్రకరుణానిరీక్షణసమాసాదితకవితావిశేష శేషాన్వయప్రదీపక వేంకటాచార్యకుమార రఘునాథార్యప్రణీతంబైన కులశేఖరమహీపాలచరిత్రంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము. 262

———

# కులశేఖర మహీపాల చరిత్ర

## తృతీయాశ్వాసము



కం. శ్రీ జయకీర్త్యభిరామ! మ
హీజాప్రియకామ! విమతహృద్భీమ! మహా
తేజస్సీమ! జగద్ధిత
రాజద్గుణధామ! రామరాజలలామా! 1

వ. అవధరింపుము గురువర్యుండు శిష్యులంజూచి యవ్వలికథ యిట్లని చెప్పందొడంగె. 2

### కులశేఖరుని రామాయణ శ్రవణము

ఉ. ఆనృపవర్యుఁ డాఘనుని యానతిఁ గైకొని సద్గుణాన్వితున్
సూనుని యౌవరాజ్యపదశోభితుగా నొనరించి నిర్భరుం
డై నిజబుద్ధికిం గడుప్రియంబగు రామకథాసుధారసం
బానుచు నుండెఁ గర్ణముల నందొక వైష్ణవముఖ్యసన్నిధిన్. 3

సీ. కౌశికువెంట రాఘవుఁడు కాల్నడ నేగె
ననుచోట రథిఁ జేతుననితలంచు
భార్గవుండాగి రాముపైఁ గిన్క నేతెంచె
ననుచోటఁ దానెదుర్కొనఁ దలంచు
కైకేయి జానకీకాంతుఁ గానలఁ ద్రోఁచె
ననుచోట మఱలింతునని తలంచు
దశరథాత్మజుఁ డద్రితటుల నెక్కదొడంగె
ననుచోటఁ దా నెత్తికొనఁదలంచు

తే. గీ. వితత కాకుత్స్థగుణ కథామృత రసైక
పానకౌతుక విభ్రాంతభావుఁడగుట

సమ్మోహరాజు తలఁపులి ట్లగ్గలించుఁ
గాలభేదమ్ము దెలియనికారణమున. 4

తే. గీ. ఇత్తెఱంగున నవ్వైష్ణవోత్తముండు
సంతతము దాశరథికథ జనవిభునకుఁ
దెలుపునెడ ఖరదూషణాది ప్రచండ
సమరసన్నాహన ప్రసంగము పొసంగె. 5

మ. అశనిధ్వాంతసమార్భటిన్ బ్రళయమేఘాకారదేహుల్ చతు
ర్దశసాహస్ర నిశాటవీరభటు లుద్యల్లీలఁ గొల్వన్ ఖర
త్రిశిరోదూషణ ముఖ్యు లారఘుకులశ్రేష్ఠున్ వెసన్ గల్వ న
శ్వశతాంగేభ పదాహత క్షితిరజస్సంఛన్నదిగ్భాగులై. 6

కం. అని కతఁజెప్పిన విని య
జ్జనపతి తాత్కాలికప్రసంగం బనుచున్
గినిసె రఘువీరపదభా
వన నొదవిన భక్తిపారవశ్యము కతనన్. 7

ఉ. అక్కట! ధర్మవత్సలుఁ డుదగ్రగతిన్ దనదేవితోడఁ దా
నొక్కరుఁ డేగుదేర రిపుయూథ మెదిర్చెఁ గదా! భరంబగున్
గ్రక్కునఁ దోడ్పడం దగు ననం గతచెప్పిన వైష్ణవుం డిదే
మెక్కడ! వచ్చెఁ నంచు భయమెత్తి దిగుల్పడి చూచుచుండగన్. 8

శా. చండక్రోధరసజ్వలజ్జ్వలనచంచద్విస్ఫులింగమ్ము లొం
డొండన్ గన్గవ క్రేవల న్వెడల నత్యుగ్రాకృతిం దాల్చి మా
ర్తండప్రక్రియనున్న రాజుఁ గనునంతన్ మంత్రిసామంతు లా
దండన్ నిల్వఁగఁజాలరైరి భయచింతావిస్మయభ్రాంతులై. 9

వ. ఇవ్విధంబున దృఢవ్రతతనయుండు సంగ్రామసంరంభవిజృంభితుండై ప్రయాణభేరి వ్రేయించిన. 10

స్రగ్ధర. తలఁకొందెన్ భూరిభేరీధ్వని చెవిసోఁకి దిగ్దంతు లత్యంతభీతిన్
గలుషీభూతంబులయ్యెన్ గడక జలనిధుల్ కంపమందెన్ మహాద్రుల్

బలభిన్ముఖ్యామృతాంధఃప్రవరు లదటునన్ బల్కి రాశ్చర్యమంచున్
దలయూఁచెన్ ధాత రాజోత్తము రఘుపతి సద్భక్తి మెచ్చుల్ ఘటింపన్. 11

వ. అంత నమ్మహీవల్లభుండు. 12

ఉ. దిగ్గనలేచి వీరరసదీప్తముఖాంబుజుఁడై సురేశ్వరుం
డగ్గలికన్ ధనుశ్శరగదాసి ముఖాయుధభీషణమ్ము స
మ్యగ్గతిశోభితోత్తమహయాన్వితమై మణిమాలికావళిన్
నిగ్గులుదేఱు తేరెదుటనిల్పిన సారథిఁజూచి ప్రీతుఁడై. 13

వ. తదారోహణం బాచరించి. 14

కం. సదమలతేజుఁడు రథహయ
మదకుంజర వీరభటసమాజము దన్నుం
బొదివికొని నడువ నరిగెన్
మది రాఘవకార్యభర సమగ్రంబగుటన్. 15

మ. నిపుణాశ్వౌఘ ఖురాగ్రఘాత మగుచున్ గెంధూళి పైసోక వి
ష్ణుపదీగాహనవాంఛ నేగుటయు నచ్చోఁ దద్రజోవ్యాప్తి త
ద్విపరీతాకృతికిన్ దొలంగి వెసనబ్ధిం జేరఁ దద్రేణుశో
ణపయఃపూరము గ్రమ్మరం గని నగె న్వైమానికవ్రాతముల్. 16

వ. ఇవ్విధంబునఁ జతురంగబలపరీవృతుండై కోదండకళాప్రచండభుజదండ
మండితుండగు నద్ధరాఖండలుండు సీతావల్లభునకు సమరసాహాయ్యం బొనరింప
నుద్యోగించు నవసరంబున. 17

కం. అదియెల్లఁ జూచి మంత్రులు
తుదిమొదలు నెఱుంగఁబడని దుష్కరకార్యం
బిది మానుప నెట్లగునని
మది నాశ్చర్యమ్ము భయము మల్లడిగొనఁగన్. 18

ఉ. ఎన్నటికైక యీవరము! లెన్నటి రాఘవరాజ్యవర్జనం!
బెన్నటి దండకోపగమ! మెన్నటితాపసవేషధారణం

చెన్నటి రాక్షసీవికృతి యెన్నటివారు ఖరాదిదానవుల్
నిన్నటినేఁటికార్యమగునే! నృపుఁడేల యెఱుంగఁ డక్కటా! 19

ఉ. సంతతమున్ దిశాంతరనిశాంతులు వైష్ణవు లేగుదెంచి యే
చింతకుఁ దారమై మనలఁ జెంతలఁజేరగనీక రాజు నే
కాంతకథావిచిత్రిత వికల్పములం గడువెఱ్ఱిఁ జేసి హా!
యెంతకుఁ దెచ్చి రయ్యె లిఁక నెవ్వరికిన్ దరమే!మఱల్పఁగన్. 20

తే. గీ. సచివు లిట్లువితర్కించి సమయసముచి
తాప్తులగు వారి నల్వుర నరసి తగిన
కార్య మెఱిఁగించి పంచినఁ గడగివారు
సైన్యములత్రోవఁ గేడించి చనిరి వేగ. 21

సీ. సముదితశ్రమబిందుసరణి ముల్ చీరలు
మేనులు మలకలై కానుపింపఁ
గవయు బీఱెండల కడిమిచేఁ గ్రాఁగు కన్
గవలు కెంజివురుల కరణిఁదనర
రాలెడు వేణుపత్రములు గ్రమ్మినమస్త
కములఁ బుష్పరజమ్ము గ్రమ్ముకొనఁగఁ
దొడిబడ నీరముల్ దూఱి కొట్టులఁ బెట్టు
కట్టువల్వల సీరికలు నటింపఁ

తే. గీ. జేరువల సారువల వెంటఁ జేరి తిరిగి
దండకాటవి నందుండి తరలివచ్చి
నట్లు మాయాపరిశ్రమం బలవరించి
మనుజపతి చూడ్కి నొదవి రమాత్యహితులు. 22

కం. డాయఁబిలిచి వారలతో
నేయెడలందుండి మీర లిటవచ్చితి రి
ట్లాయాసపడుచు ననవుడు
మాయికు లిట్లనిరి రాజమణికిఁ బ్రణతులై. 23

ఉ. భూవర! దండకాటవుల పొంత ఘనౌషధు లుండునంచుఁ దేఁ
బోవఁగ నందు బాహుబలభూషణుఁ డారఘువీరుఁ డుగ్రదై
త్యావళితో రణమ్మునకు నాయితమౌటయు నేము చెంగటన్
గ్రావతటమ్మునన్ నిలిచి కన్గొనుచుండితి మద్భుతమ్ముగన్. 24

తే. గీ. ఇనకులోత్తముఁ డసురుల నెల్లఁ దునిమె
నపుడు శోణితవేణిక లడరఁ జూచి
వెఱచిపఱతెంచినార ముర్వీతలేశ!
యనుచుఁ జెప్పిన వెఱఁగంది యతఁడు పలికె. 25

కం. ఈగతి నొకరఘుపతియే
నాగాశ్వభటోగ్ర దైత్యనాశక్రీడా
యోగోద్ధతుఁడై యొసఁగుట
భోగీంద్రశయానుఁ డతఁడె పో! యూహింపన్. 26

చం. అనుటయు వార లానృపకులాగ్రణిఁ జూచి రఘూద్వహుండు ము
న్ననసిన బాల్యవేళ మిథిలేంద్రుని వీఁట నరేంద్రులెల్ల మున్
గినియు కపర్దికార్ముకము కేలఁ దెమల్పఁగ నేగుచున్నచో
జనకుని సంశయంబెఱిఁగి సయ్యన గాధిసుతుండు నవ్వుచున్. 27

శా. బాలుం డీనరపాలసూనుఁడు ధనుర్భారం బతిస్ఫార మే
లీలన్ దీనిఁ గదల్ప నోపునొకొ యీలేఁ జేత నంచాత్మ ను
ద్వేలం బెట్టకు చండభాను గహనాద్రీలా సముద్రేందు ది
క్పాలోద్యద్బ్రహ్మాండ భాండమెగవైవం జాలు హేలాగతిన్. 28

తే. అనుచు ముని పల్కుపలుకులు జనములెల్ల
కతలుగాఁ జెప్పవినమె! లోకప్రచార
మరసి రక్షించునట్టి మహానుభావుఁ
డకట మనసాహ్య మతనికేమగు నృపాల! 29

కం. అని వారు పలుకుపలుకులు
విని సంతసమంది సుభటవిసరము గొలువన్

జని పురముసొచ్చి యచ్చట
సనయస్థితి నుండె రాముచరితము వినుచున్. 30

ఉ. రాజ్యము సేయుచుండి యువరాజొకయించుక లేక లోభమున్
ద్వ్యాజ్యము సేసి సత్త్వగుణధన్యత పెంపువహించి వైష్ణవ
ప్రాజ్య సమాగమోత్సుకిత భావముచే నొగిఁ దత్పదాబ్జముల్
పూజ్యములై దలిర్ప మణిభూషణముల్ మదిఁ గోరఁడేమియున్. 31

ఉ. మంత్రులు వైష్ణవోత్తమసమన్వితులై విలసిల్లు రాజునా
మంత్రణ కార్యభాషణ సమర్థనవేళ ఘటింపకున్న దు
ర్మంత్రము బూని వాకిటఁ నిమంత్రితులైన భటాళితోడ వా
క్తంత్రము మీఱి మీరు నృపుదండకుఁ జేరగనీకుఁ డయ్యలన్. 32

వ. అని నియమించి చనుటయు. 33

మ. నరనాథుం గను వేడ్క వైష్ణవులు సన్నాహమ్ముతో దిక్కులన్
హరిదివ్యస్థలవాసులౌట ఫలభక్ష్యవ్రాతముల్ చందనో
త్కరముల్ జేర్చిన తీర్థవ ల్లుభయహస్తమ్ముల్ వెసం గొంచు చె
చ్చెర విచ్చేసిరి తిర్వగూడలు భుజశ్రేణిన్ విడంబింపఁగన్. 34

ఉ. కావలివారు వాకిలెడగా నెనురేగి మహాత్ములార!మా
భూవరునాజ్ఞ లేదిఁక ప్రభుప్రియవాదములాచరించి సం
భావన బొందఁ గాలమొకభంగి నటించునె!వచ్చుత్రోవలన్
బోవుట కార్య మంచుఁ దమ మూర్ఖత నడ్డము వచ్చినిల్చినన్. 35

తే. గీ. అని నిరోధింప వార లన్యోన్యముఖ ని
రీక్షణ మెలర్పఁ బ్రభుదర్శనేచ్ఛ యాత్మ
సందడింపంగ శ్రీనివాసా! యటంచు
వేడ్కఁ గూర్చుండి రొగి బహిర్వేదికలను. 36

కం. మానవపతి తనకు సను
స్థానసమయమగుట నిరుగడల భాగవతుల్
గానబడ రనుచు మదిలో
నూనిన సంతాపమున సముత్థితుఁ డగుచున్. 37

ఆ. వె. పాదచారి యగుచు భవనముల్ వెడలి త
ద్ద్వారభూమి గడచి ధరణిభర్త
వెలయఁగాంచెఁ బార్శ్వవేదులఁ గూర్చున్న
భవ్యమూర్తులైన భాగవతుల. 38

మ. నృపముఖ్యుండు వెసన్ బ్రణామవినయప్రేమల్ విజృంభింప ఘ
ర్మపయోలేశలసన్ముఖాంబుజుల సన్మానార్హులన్ నిష్ఠురా
తపదేశస్థితులైనవారిఁ గని చిత్తం బుత్తలంబంద నే
యపచారమ్ము ఘటిల్లెనో యనుచుఁ జింతాక్రాంతుఁడై యిట్లనున్. 39

కం. దాసుని యిలుద్రొక్కి కదా
జేసిన యపరాధ మెఱుఁగఁజెప్పక కరుణా
భాసురహృదయులు మీ రా
యాసంపడదగునె యెండ నలమట దోఁపన్. 40

తే. గీ. అనిన వారిట్లులనిరి మహాత్మ! నీకు
నరయ నపచార మిసుమంతయైనఁ గలదె!
ద్వారపాలురు రాజాజ్ఞ దప్పదనుచు
బలిమి మమ్ము నిరోధింప నిలువవలసె. 41

వ. అని తెలియంబలికిన. 42

శా. చండక్రోధరసానలప్రభలు చంచన్నేత్రకోణమ్ము లం
దొండొండన్ వెడలంగ భూరమణుఁ డత్యుగ్రాకృతిం దాల్చి పే
రెండన్ ద్రోఁచిరి వైష్ణవోత్తముల మీ రీద్వారపాలాంధులన్
ఖండీభూతులఁ జేయుఁడంచుఁ బనిచెన్ ఖడ్గాయుధోదగ్రులన్. 43

తే. గీ. అనుచుఁ బనిచినఁ దలవరు లధిపునాజ్ఞ
ద్వారపాలురఁ ద్రుంప నుద్ధతి వహింప
వలదు వలదిట్టి కార్యమ్ము వసుమతీశ
యనుచు శ్రీవైష్ణవోత్తము లడ్డపడిరి. 44

వ. ఇట్లామహాత్ములానతిచ్చిన నుపశమితక్రోధుండై సవినయంబుగా శ్రీవైష్ణవులం దోడుకొని నిజభవనంబునకుం జని ప్రియవచనపూర్వకంబుగా సంభావితులం జేసె తదనంతరంబ. 45

చం. అనవరతమ్ము రాజహృదయానుగతిం బఠియించు వైష్ణవుం
డనుపమకార్యభారమున నందొకయూరికిం బోవుచుండి నం
దను నృపసన్నిధిన్ ఘనకథాశ్రవణమ్ము ఘటింపఁబంప న
య్యనఘుఁడు గోపనీయమని యాత్మ నెఱుంగక చెప్పెనంతయుం. 46

ఉ. అక్కట రావణాసురుఁ డుదంచితమాయుఁడు రామలక్ష్మణుల్
గ్రక్కున మాయలేడి వెదుకంజనునట్లు ఘటించి జానకిం
గ్రుక్కిక నెత్తికొంచుఁ జనుచోట జటాయువుఁ ద్రుంచి దుర్మదం
బెక్క నిజప్రణాశగతి నిచ్చ నెఱుంగక నేగె లంకకుం. 47

తే. అనిన నులుక్కుచు నృపుడు సభ్యాళిఁ జూచి
వింటిరే! లోకమాత నుద్వృత్తిఁ దెచ్చి
యసుర చెఱఁద్రోచె ననుట యేనితనిఁ ద్రుంచి
సీతఁ దోడ్తెచ్చి రఘురాముఁ జేర్పవలయు. 48

## కులశేఖరుఁడు రావణునిపై దండెత్తుట

వ. అనిపల్కి ప్రచండరోషకాషాయితలోచనుండగుచు మహనీయ జవోద్రేకహసితోచ్చైశ్శ్రవంబగు నిజాశ్వంబు సన్నద్ధంబుజేసి తెచ్చినఁ దానునుం గట్టాయితంబై యతిఘోరధారాభీలంబైన కరవాలంబును గనకబిందుసందోహ సముజ్జ్వలంబైన ఖేటకంబును ధరియించి తద్గాఢఫోహణంబు సేయునవసరంబున. 49

సీ. ఇది పూర్వకార్య మవ్వీశ! యిట్టిటికి
వేగిరపడ నంచు విప్రవరులు
రామరావణచరిత్రంబు మున్నెఱుఁగవె
మఱువ నేమిటికంచు మంత్రివరులు
కయ్యంబుసేయ నేగదలంచి యిదియేమి
మముఁబిల్వవంచు సామంతవరులు
నెన్నాళ్ళకథయిది యివ్వేళవైష్ణవుం
డెక్కబెట్టెనటంచు నితరజనులు

తే. గీ. బహుజనంబిట్లు బహువిధభాషణముల
వలదువలదను ఘోషమ్ము వసుమతీశు
కర్ణముల సోఁకదయ్యె రాఘవపదాబ్జ
వర్ణనోల్లాస భాసురస్వాంతుఁడగుట. 50

మ. తురగ క్రూరఖురాగ్ర ఘాతధరణీధూళిచ్ఛటల్ గ్రమ్మ ది
క్కరి గండోదితదానబిందుచయ మింకన్ జండబాహావిని
ష్ఠుర కౌక్షేయకఘోరదీప్తి మదనిష్ఠ్యూతాహితవ్రాత దు
స్తరగర్వాంధతమం బడంగ నృపరత్నంబేగె నుగ్రాకృతిన్. 51

చం. వెనుకొని వచ్చు సైన్యములు విశ్రుతఘోష సముద్రతోయమున్
గని వెఱగంది నిల్చె రతిగాఢభయంకరఘోష మొప్ప న
జ్జనపతి సక్రపన్నగ ఝషప్రకరప్రతిభాజగత్త్రియా
పనిత మహాబ్ధివీచికలపైఁ బఱపెన్ జటులాశ్వరత్నమున్. 52

తే. గీ. అల రమాదేవి వైదేహియయ్యె నప్పు
డెలమి శేషాహి లక్ష్మణాకృతి వహించె
చక్రహస్తుండు రఘుకులస్వామియయ్యె
వరుస నేతెంచి రామహీశ్వరుని కడకు. 53

కం. వచ్చి నృపముఖ్యు భక్తికి
నచ్చెరువడి చూచి మందహాసానుఁడై
మెచ్చు దళుకొత్తఁ బలికె వి
యచ్చరసంఘంబు ప్రేమ నభినందింపన్. 54

ఉ. రాజకుమార! యేను రఘురాముఁడ రావణనామదైత్యు ఘో
రాజి నెదిర్చి వానితనయాప్తులతోడ వధించినాఁడను
ద్వేజకమయ్యె వార్ధికి మదీయశరోద్ధతి యింక సద్యశో
భాజనమయ్యెఁ గార్యగతి భామినిఁ దోడ్కొనివచ్చితిం జుమీ! 55

చం. ఎలమి మదీయభక్తిభర మెల్లను నీవ వహించినాఁడ వి
జలనిధి నీటిపైఁ జనుట చాలు పురంబున కేగు వత్స! నీ

వలన సమస్తభాగవతవర్గము కోర్కులు చెందుచుండు ని
ర్మలగుణసంపదన్ భువనమాన్యచరిత్రుఁడ వెన్నిచూడఁగన్. 56

తే. గీ. అపుడు తురగమ్ము డిగ్గి రాజాత్మజుండు
హర్షబాష్పమ్ము లెసఁగఁగ సమ్మహాత్ము
చరణకంజాతముల వ్రాలె చటులమకుట
గతమణిప్రభ తన్నఖద్యుతులఁ బెరయ. 57

కం. కరములు మోడ్చుచుఁ బులకాం
కురములు మెనిగుడ వినయగుణభూషితుఁ డ
న్నరపతి రఘువల్లభు భా
సురసుందరమూర్తిఁ జూచుచున్ వెసఁ బలికెన్. 58

చం. నిరుపమశీల! లోకజననిం జెఱవెట్టిన దుష్టచిత్తు సో
దరసుత బంధుమిత్ర సహితంబుగఁ ద్రుంచుట చోద్యమే! భవ
చ్ఛరనికరాగ్నికీలము లెసంగినచో నిలువంగ మేరుమం
దరగిరులైన నోపునె నితాంతయశోబల భవ్యవైభవా! 59

శా. రాజీవాహిభయంకరాబ్ధి చులుకప్రాయమ్ముగా దాఁటి ఘో
రాజిన్ దానవరాజి రాజితమహోగ్రాస్త్రమ్ములం ద్రుంచి ది
గ్రాజవ్రాతము వేడ్కఁ జెంద భువనప్రఖ్యాతి వాటించి తౌ,
రాజీవాక్ష! భవత్పదాబ్జములు హృద్రంగమ్మునన్ గొల్చెదన్. 60

కం. అనుచు వినుతించు నృపతిన్
వినయానతవదను గారవింపుచుఁ బురికిన్
జనుమని యాజ్ఞ నొసఁగి య
ద్దనుజాంతకుఁ డరిగె నాత్మధామంబునకున్ 61

వ. ఇప్పగిది సప్పరమేశ్వరుం డానతిచ్చిన నప్పుడమిఱేఁ డనన్యసాధారణ పరాక్రమోపక్రమ విదళితవిరోధిసైన్యంబగు నిజసైన్యంబుతోడఁ బురంబు ప్రవేశించి సుఖంబుండె మఱియును. 62

## నీళాదేవి యవతరించుట

కం. ఈలీల నలరు ధరణీ
పాలాగ్రణి సతికి సత్యభాషిణికి వెసన్
నీళాదేవ్యంశంబున
బాలామణి పుట్టె రుచిరఫాలాలకయై. 63

కం. నీళాభిధానయగు న
బ్బాలిక విలసిల్లె ధవళపక్షేందవరే
ఖాలీలఁ బెరిగెనంత వి
శాలంబగు యౌవనావసర మేతెంచెన్. 64

సీ. సంపూర్ణశశికళాజాలంబు మెచ్చని
ముఖమున కొకవింత పొలువు దోఁచె
వికసితేందీవరప్రకరమ్ము నోడించు
కన్నుల కొకవింత కాంతి దనరె
కలహంసకృతమందగమన మెంతనఁజాలు
నడలయం దొకవింత నలువెసంగె
శుకపికాలాపనిస్తులమాధురి కెదుర్చు
పలుకుల కొకవింత చెలువు మిగిలె

తే. భ్రమరసందోహచక్రవాకముల గెలుచు
కచకుచంబుల కొకవింత రచనవొడమె
సరవి నవయవ సౌందర్యసౌష్ఠవంబు
వెలసె నవయౌవనాగమవేళ సతికి. 65

సీ. కచము సారంగలోకంబుతోఁ జర్చింప
గమనంబు సారంగగతుల గెలిచె
నయనముల్ జలజబృందములపైఁ దార్కొన్న
కంఠంబు జలజసంఘముల గెలిచెఁ
గటితటంబొగి రథాంగములతోఁ బురణింప
ఘనకుచంబులు రథాంగముల గెలిచె
రసవదోష్ఠము పద్మరాగంబుల హసింప
కరములు పద్మరాగముల గెలిచె

తే. గీ. నువిద రుచిరాంగకంబులం దొకటికొకటి
సొంపు రెట్టింప దీపించె సురనరాంగ
నానికాయంబునం దిట్టి నవ్యరూప
సంపద పొసంగునే యంచు జనులుపొగడ. 66

వ. ఇత్తెఱంగున సర్వాంగసౌందర్యశోభితయగు నయ్యంగనారత్నంబు సఖీజనమ్ములతోడ నాడుచుఁ బితృసన్నిధానంబునం బుణ్యకథలు వినుచుఁ బ్రసిద్ధి వహించియుండె నంత. 67

కం. రంగముననుండి వైష్ణవ
పుంగవులు శమాదిగుణవిభూషిత చేత
స్సంగు లొకకొందఱా నృప
తిం గనుగొనువేడ్కఁ నేగుదెంచిరి నెమ్మిన్. 68

కం. ఈరీతి నేగుదెంచిన
వారల కెదు రేగి మ్రొక్కి వరమణిమయపీ
ఠారూఢులఁ గావించి య
హీరమణుఁడు పూజసేసె నెలమిదలిర్పన్. 69

వ. ఇవ్విధంబున నమ్మహానుభావుల సంభావించి తదనుజ్ఞఁగైకొని తానును సమాసీనుండై సంభాషణమ్ములు సలుపుసమయంబున వారలతో శ్రీరంగవల్లభుని గుణరూపవైభవమ్ము లెట్టిట్టివనిప నగుచు నమ్మహాత్ము లిట్లనిరి. 70

తే. గీ. విశ్వమునకెల్ల విభుఁడు తద్విధవ మిన్న
నలవియే యింక నతని కల్యాణగుణము
లజునకైనను గణుతింపనగునె రూప
మాపింపు యూహింప మన్మథమన్మథుండు. 71

కం. అని మఱియు హరిచరిత్రము
జనపతికిం దెలుపుచున్న సమయమ్మునఁ దా
విని నిశ్చయించె నీళా
వనజేక్షణ విభుఁడు రంగవల్లభుఁడనుచున్. 72

వ. ఇత్తెఱంగున నన్నీళాంగన రంగవల్లభునెడం బొడమిన మోహాంకురంబు దినదినప్రవర్ధమానంబగుటయుఁ బెల్లుకొను విరహశ్రమంబునన్ గుందుచున్నంత. 73

చం. సవినయలీల రంగపతిసన్నిధికిం జను దూరదేశభా
గవతులు రాజకన్య గుణగౌరవరూపవిలాస [కాంతి]సౌ
ష్ఠవములు సారెసారెకుఁ బ్రసంగవశంబున నెన్నవిన్న య
న్నవనలినాక్షుఁ డాచెలి మనంబునఁగోరె బరిగ్రహింపఁగన్. 74

ఉ. హేయ భవవ్యపాయ రసికేహిత దివ్యపదప్రదుండు ప
ద్మాయతలోచనుండు సుగుణాంబుధి శౌరి, వధూవిమోహ చిం
తాయుతచిత్తుఁడౌటకు ముదంబునఁ బొంగి యనంగుఁ డుబ్బునన్
గో యని కేలుసాచె నునుగ్రొవ్విరికోలకుఁ బచ్చవింటికిన్. 75

వ. ఇత్తెఱంగున రంగవల్లభుండు నీళాంగనాపరిష్వంగసముత్సుకాంతరంగుండై యున్నయెడ. 76

ఉ. అంత వసంతమింపెసఁగె నద్భుతసౌరభలోభబంభరా
క్రాంత చలల్లతాంతము వికస్వరపద్మనళిన్యుపాంతవి
శ్రాంతమరాళకాంతము రసాలకిసాల రసానుమోద సం
భ్రాంత పికావళీమృదుతరస్వర భాసుర తానిశాంతమై. 77

సీ. సహసాసముల్లసత్సహకారమంజరీ
పుంజమంజుల విభాభూషితమ్మొ
మల్లికావల్లికీ మధుపతంత్రీ ఝుంకృతి
స్వనోత్సుక కిరాతీజనమ్మొ
మత్త్యజాశాశుక త్రోటీత్రుటత్పక్వ
ఫలరసాపాత పంకిలతలమ్మొ
కలహంసమాలికాకులితపంకజ రజ
శ్ఛన్నకాసారాంబు సౌరభంబు
తే. గీ. సరసకిసలయ చర్వణోత్సాహ కలిత
వితత కోకిలకాకలీ సితఖలీన

కర్షణత్క్షుబ్ధ విముఖిత గమనపాంథ
సైంధవము మధుమాసవాసరము దనరె. 78

సీ. పశ్యజ్జనేత్రానుభావ్యంబులై కేసరంబులఁ
దగు కేసరంబులకును
ప్రచలత్సరోజకైరవమందిరమ్ములై
సరసులకింపైన సరసులకును
లలితవిచిత్రపల్లవశోభి సుమరమా
కందమ్ములైన మాకందములకు
మధుపానమదలీన మధురవాగ్భ్రమరీ
కదంబంబులైన కదంబములకు

తే గీ. పనసజంబూ శిరీషచందన మధూక
మాలతీకుంద కురవక మల్లికాది
తరులతాగుల్మతతులకు సిరి దనర్చె
మాధవోత్సాహశక్తికి మాఱుగలదె ! 79

వ. ఇవ్విధమ్మున మధుసమయప్రేరితమ్ములై పల్లవకుసుమఫలవిలసితంబులగు మాకందమధూకకేతకీవకుళచంపకశిరీషమాలతీ కదంబజంబూమాధవమన్మథమల్లికాప్రభృతి సకలమహీరుహశోభితారామంబులు లోచనాభిరామంబులై యొప్పుచున్నంత. 80

కం. భూవరకన్యక రంగ
ధామవల్లభు వలన విరహసంభూతవిచా
రావిలమానస యగుతఱి
భావించి వధూజనమ్ము భయశంకితమై. 81

కం. మును రంగస్వామి పయిఁ
జనియించిన మమతకతన సంచలితమనో
వనజ యగుచున్నయది చెలి
వనకేళిఁ బ్రొద్దు గడపవలయుఁ మనకుఁ. 82

వ. అని తలంచి యన్నాలంత యలంత బాపుటకు సఖీజనంబు లుద్యాన వనంబునకుఁ దోడ్కొనిచన నుద్యోగించు నప్పుడు. 83

కం. ప్రాలంబాలంబిత కుచ
రోలంబాలక విడంబరుచిరకరలస
త్కోలంబకనీలాంబక
నీళాంబుజవదన కదలె నెచ్చెలు లలరన్. 84

వ. ఇవ్విధంబున సఖీపరివారపరివృతయై మందగమన యారామసమీపంబునకుం జనునెడ. 85

### వనవిహారము

సీ. ప్రచురమరందనిర్భరలతాంతమ్ముల
దొంతులు దొరలంగఁ ద్రోచిత్రోచి
సరసారసవికస్వరకుడుంగంబుల
పత్రముల్ గదలంగఁ బ్రాఁకిప్రాఁకి
రమణీయకనకవర్ణప్రకాశములైన
పుష్పాదుల్ మెయినిండఁ బొరలిపొరలి
వాసంతికాలతావ్రజకీలితమ్ములై
యొనరు నుయ్యెలలెక్కి యూఁగియూఁగి
తే. గీ. కదలిఁ గదలించి విరజాజిపొదలఁ బొదలి
కీచకమ్ముల మొరయించి కేకితతుల
గరులు చెదరించి భ్రమరసఖ్యము వహించి
పవనడింభకుఁ డెదురేగె పద్మముఖికి. 86

కం. మలయానిలాంకురము పై
నొలసిన మదిసంచలింప యువతీమణి నె
చ్చెలులఁగని పలికెఁ గ్రేవల
విలసిల్లెడు తరులఁజూచి విస్మయమెసఁగన్. 87

సీ. కౌసుంభవసనయోగప్రకాశములయ్యె
నవి మన్మథుని తేరులటు మృగాక్షి
రచితరేఖావిచిత్రమ్ములై దీపించె
నవి మారునిపతాకలటు శుభాంగి

నవహేమరుచిరభాండవిభూషితములయ్యె
నవి కంతుని హాయమ్ములటె సుమధ్య
నీలగండశిలావిశాలమ్ములై యొప్పె
నవి దర్పకేభమ్ములటె సుధోష్ఠి

తే. గీ. యనిన సఖు లింతి నీక్షించి యవియనూన
కింశుకము లవికుసుమితకేసరమ్ము
లవిసుమితచంపకములు పల్లవితగురిత
మాలభూజమ్ములల్లవి మధురవాణి! 88

వ. మఱియు నిట్లనిరి. 89

సీ. పున్నాగసదయానుభూతి గోరెదు నీకు
పున్నాగసంగ్రహాస్ఫురణ వలదె
సహకారఫలపరీక్షణ మెఱింగిన నీకు
సహకారఫలపరీక్షణము వలదె
ప్రియకాంతసుమనోనువృత్తిగాంచిన నీకు
ప్రియకాంత సుమనోనువృత్తి వలదె
బంధుజీవకగుణప్రతిభగాంచిన నీకు
బంధుజీవక సౌరభంబువలదె!

తే. గీ. సమదమధుకరశుకపికసముదయముల
డిందుపఱచుట కిదియుందు సుందరదన
సూనఫలపల్లవమ్ములఁ జాఱగొంద
మనుచు వన కేళి సలిపి రయ్యబ్జముఖులు. 90

మ. ఒకనారీమణి మల్లికాసుమములన్ యోజించి రాజన్యక
న్యకకున్ దోయిఁట నించినన్ గరతలోద్యద్రాగమేపారఁ గిం
శుకసూనభ్రమ నింతి నీ కతగఁనంచున్ ద్రోయఁ గాంతల్ వకా
వక నవ్వన్ విరు లేన త్రుంతు ననుచున్ భాషించె రోషమ్మునన్. 91

తే. గీ. సుదతి విరు లీవుగోయఁ బయ్యెద తొలంగి
బాలనీలాహిగతి నాఱు బయలువడియె

కొమ్మ వయినున్న నెమ్మి కన్గొనక మున్న
క్రమ్మకొనవమ్మ సరిగ చెఱంగు దిగిచి. 92

తే. గీ. అలరుఁ దేనెలు తేంట్ల కాహారమగుట
కొమ్మ విరిగొమ్మ కదలింపకమ్మ కమ్మ
విలుతుఁ బిలువంగ షట్పదకులము గినుక
కదలె నరమించు పసులకుఁ గరుణకలదె ? 93

తే. గీ. అకట కర్ణావతంసమ్మునకు రసాల
పల్లవమ్ముద్రుంప నాయాసపడకుమమ్మ !
చెన్నుదళుకొత్తు చివురునఁ జివురుకోయ
వశమె ! యేద్రుంచియిచ్చెద వనిత నీకు. 94

చం. వకుళముడాయ నంచు ఖగవర్గము లిట్టటుబాఱఁ దద్గరు
త్ప్రకటితమారుతాహతుల రాలిన పుష్పొడి మేనసోక ద
ర్పకవశతన్ దుపానలము పైఁబడినట్లు వణంకుచున్న య
మ్మకరనిభాననం బొదివి ముద్దియ లూఱడిలంగఁ బల్కుచున్. 95

తే. ఇది యదనుగాగ నీయెడఁ గుసుఱుపఱచి
మదనుఁ డదయత పూఁములు్కు లొదవఁజేయ
బెదరుకొను నీవు మెదలు తుమ్మెదల రొదలఁ
బొదలు పొద లేలదూఱెదు మృదులవేణి ! 96

సీ. వనిత పుప్పొడిఁద్రొక్కి వగచెదు విరిఁదేనె
మడు వల్లయదియె కాల్గడుగవమ్మ
శుక మోష్ఠబింబమ్ముఁ జూడ భీతిలకు మి
చ్చటు సంకుసౌగంధ్య జటిలమమ్మ
తుమ్మెదల్ నెమ్మోమ్ముదమ్మిఁ బైకొను చింత
దలఁగి సంపగివిరుల్ దాల్పవమ్మ
మలయానిలమ్ము పైనొలయు నంచడలకు
వేణికాఫణి డాయ వెఱచునమ్మ

తే. గీ. కొమ్మ యీలీల వెతనందకమ్మ రంగ
వల్లభునిఁ గూడి బహుకేళివైభవముల
నెలమి వాటింప నీశుక మీపికంబు
మదనకుముదాప్తు లాప్తులయ్యెదరు నీకు. 97

వ. అనిన వారలతో రాజకన్య యిట్లనియె. 98

కం. అతివ వని నెసఁగె విరహుల
నతనుం డేచుటకు సేయు ననలాస్త్రంబుల్
మతిఁ గుందనగునె జ్యోతి
ర్లతల ద్యుతులనుచుఁ దెలియరాదె మృగాక్షీ ! 99

తే. గీ. ఉవిద చెంగట రవమిచ్చె నొకపికమ్ము
చెవికిఁ జేదయ్యె నిక నేమిసేయుదాన
కాదుకాదమ్మ మనకలకంఠి యొకతె
పంచమస్వరగతి పాటపాడఁ దొడఁగె. 100

వ. ఇట్లు నారీశిరోమణి నూఱడింపుచు సఖులెల్లఁ గుసుమాపచయకుతూహలంబునం జరియించుచున్నయెడ. 101

సీ. చెలియోర్తు దాడిమీఫలకాంతిఁ బఱతెంచు
శుకములఁ దోల నొండొకతె గొనియె
వెలఁదియొకర్తు కోకిలసూక్తులకు మాఱు
పలుకంగ సరియంచుఁబలికె నొకతె
సకియ యొకర్తె సూనశాఖ వంపకమున్నఁ
జూచితినని కోయఁజూచె నొకతె
వనితయొకర్తె హంస వెనువెంట గతిఁజూప
నొప్పుగాదనుచు నొండొకతె నడచె

తే. గీ. మఱియు రుచిరక్రియా వచోమహిమ మిగుల
సరవిఁ బుష్పాపచయ కళాచతురగతుల
భామినులు కాలయాపనప్రౌఢి సలుప
నీళ సొలయుచు నొకమావినీడ నిలిచె. 102

తే. గీ. కలికి యొక్కతె గడువేడ్కఁ గరములెత్తి
ధరణిఁ జరణాగ్రముల నూఁది విరులుగోయ
కుచసరోరుహకోశముల్ కొండలయ్యెఁ
గాను వీక్షింప నడియొక గగనమయ్యె. 103

వ. ఇవ్విధమ్మున బహువిధవిహారపరిశ్రాంతలగు నన్నెలంత లక్కాంతా మణిం దోడ్కొని నిశితాతపక్లాంతమ్ములగు శరీరంబులు స్వేదోద్గమాక్రాంతంబు లగుటయు జలావగాహంబు గోరుచుం బోవుచున్న యెడ. 104

సీ. మధుపానవదనూన మదలీనసదళీన
పదసూన మృదుగాన బంధురమ్మై
తతకుంజ తమాలతతి ఖేలదతివేల
పతగాలపిత జాల భాసురమ్మై
స్మరశాతశరపాత పరిభూతనరజాత
విరహాతపరయేత భరహరమ్మై
రసనాగబిసపూగ కిసభాగరసభోగ
రసికాగతసరాగ రాజహంస

తే. గీ. మమల కైరవకమల గంధానుబంధ
మలయ మరుదంకురాగమోన్మాద చరిత
పాంథసందోహమగు సరోవర మొకటి
యానెలంతల కచ్చోటఁ గానబడియె. 105

కం. చని సంతసించి శశిముఖు
లానరఁగ నొండొరుల కరయుగలూఁదుచుఁ జని ర
ల్లన పదములిడుచు శీతల
వనజాకర జలవిగాహ వశమతు లగుచున్. 106

మ. అతులాంభోజ విరాజమాన సరసీహంసావళిం గేరి య
య్యతివల్ నీరమునం జరింపఁగఁ దదీయాంగమ్ము లుత్తుంగ దీ
ప్తతటీ స్ఫాటికరత్న బింబితములై భాసిల్లె లాస్యైక స
మ్మతలీలం బ్రతిసీరపైఁ బసిఁడిబొమ్మల్వోలె శోభిల్లుచున్. 107

సీ. ఆమందయానల హాసస్వరమ్ములు
 బెరయు హంసమ్ములు బెదరివఱచె
నాఘనస్తనుల బాహాగ్రవిక్షేపముల్
 కనుగొని చక్రవాకములు బెదరె
నాచంచలాక్షుల యంఘ్రివిన్యాసార్భ
 టులకుఁ బాఠీనమ్ము లలవుదరిగె
యానీలకచల యాహ్వానధ్వానులు బర్వి
 నెరిఁ బాసి భృంగముల్ నింగికెగసె

తే. రాజవదనల చల్లుపోరాట వేళ
వనజబృందమ్ము లొకవంక వ్రాలఁదొడఁగె
నొకటిచే మున్న యోటఁగియున్న వాని
రెండవవి కొన్ని పొడవంగ గుండెచెడదె. 108

ఉ. డాయుచుఁ బాయుచుం గరపుటమ్ములు సాచుచు వారిపూరమున్
దోయజలోచనల్ చలముతో నితరేతరవక్త్రబింబ ల
త్త్యాయతదృష్టిఁ జిమ్ముచు సహాసవచోరచనల్ జెలంగ నీ
రాయతనమ్మునం దరగలాడవు తత్తటఘట్టితమ్ములై. 109

శా. స్తుత్యశ్రీలగు మేనులం దొరగి కస్తూరీమిళత్కుంకుమ
ప్రత్యప్తాగురు పంకసంకర హరిద్రాచూర్ణముల్ గ్రమ్మి సాం
గత్యంబేర్పడఁ జిత్రవర్ణములచేఁ గాసార మొప్పారుచో
వాత్యుక్షిం జలకేళిసల్పె నబలావర్గం బుదగ్రమ్ముగన్. 110

తే. పద్మషండమ్ము లందొక్క పంకజాక్షి
మునిగి మోమెత్తియున్నచో ముగుదలెల్ల
కని వదనమంచు నదిగాదు కమలమనుచు
నిశ్చయింపంగఁజాలక నిలిచి రపుడు. 111

కం. మీను తొడఁదగిలి యులికెడు
మానిని వెరుచఱచి వెరపుమాన్పుచు నొకప
ద్మానన గంతులువైచెను
దీనతఁ దనకాలు నాచుదీవఁ దగిలినన్. 112

ఉ. అంచలు చక్రవాకము లుదంచితగుంజదళిప్రసంగముల్
కాంచనసన్నిభాబ్జములు గాంచి మనోజుఁడు మెచ్చు రచ్చవ
ట్టంచుఁ దలంచి చిత్తమురియాడగ నీరవిహారలీలఁ జా
లించి సరోవరమ్ము వెడలెన్ నరపాలకుమారి గ్రక్కునన్. 113

తే. నెచ్చెలులు రాజకన్యక నెమ్మనమున
వెఱపుమిగులుట దెలిసి వెన్వెంటఁ గొలను
వెడలి తటసైకతస్థలి నిడినమడుగు
లెలమిఁదాలిచి రెంతయుఁ జెలువుమిగుల. 114

తే. అప్పు డళివలు నెరులార్చి కొప్పుదీర్చి
తిలక మలికమ్మున రచించి కలపములఁది
క్షితితలేశ్వరుకన్యఁ గైసేసి రెలమి
చెలిమి నొకయింతి పూబంతిచేతి కిచ్చె. 115

తే. విరహపరితాపభరమున వివశ యగుచు
సొలసి తూగాడుచున్న యన్నెలఁతఁ జూచి
లలితమగు నిందుకాంతశిలావితర్ది
నొనరు కిసలయశయ్యపై నునిచిరంత. 116

## సూర్యాస్తమయవర్ణనము

చం. వనధిలుఠత్తరంగముల వ్రాలుటకున్ వెఱపగ్గలించినన్
దనదు మయూఖవార మొకదారిఁ జనన్ బెడఁగైన మేనఁదా
ర్కొనిన వివర్ణవృత్తికి మఱుంగుగ శోణపటంబు దా వహిం
చినగతి రక్తదీప్తిఁ బొలిచెన్ రవి పశ్చిమశైలసంగతిన్. 117

సీ. చరమాద్రి తటనటచ్ఛంబరార్భకులు చిమ్మ
చిచ్చుఱకొమ్మల జిగి యనంగ
హరు లబ్ధిసారమి మల్లాడు కుంకెనకుఁ దో
డ్పడవచ్చు ఖగవిభుప్రభ యనంగ
దళితమందేహకంధర నుద్గమించి మి
న్నొరసిన శోణితద్యుతు లనంగ
నినుఁబాసి వగచు పద్మినుల క్రేఁగన్నుల
మితిమించు శోణదీధితులనంగ

తే. గీ. రవిరథావక్ర చక్రచంక్రమణ జనిత
రవసముద్రిక్త కోపనిర్యద్భుజంగ
బహుఫణారత్న భవకాంతి పటలములఁగ
సాంద్ర సంధ్యారుణచ్ఛవిచ్ఛటలు దనరె. 118

కం. ఏదిశలను రవిసింహము
ప్రోఁదిన్ బరికించి పిదపఁ గ్రుంకినఁ గని స
మ్మోదంబునఁ బొంగి తమో
వేదండశ్రేణి గుహలువెడలెఁ బెలుచన్. 119

మ. ప్రమదంబొంది తమిస్రయోషిదలకవ్రాతమ్ములన్ మెచ్చి దం
ష్ట్రిమహిష్యాదులఁ బ్రోఁదిచేసి గజరాజిన్ గౌఁగిటం జేర్చి కా
కమయూరీగళకోకిలమ్ములకు సాంగత్యమ్ము వాటించి గ
ర్వమణంచెన్ బకశంఖహంసహారి జీవంజీవజాతమ్ములన్. 120

తే. గీ. జారచోరుల రాత్రిప్రచార మెఱిఁగి
ఘూకఫల్గునికాదు లాగుణము గాంచె
జాతి వేఱయ్యు మనుజభాషణము లెఱిఁగి
శారికలు మాఱుపలుకుట సాక్షిగాదె! 121

తే. గీ. వసుధ విహరించు రాత్రిదేవతకుఁ బ్రీతి
సత్కృతిరొనర్పఁ దలఁచి దిక్సతులు వేడ్కఁ
దనర బహుపుష్పములు మేన నునిచినట్లు
దివి బహుగ్రహతారకల్ తేజరిల్లె. 122

చం. ఇనుఁ డతిరక్తి మున్ను దనునేర్పడఁ జెంది యతిక్రమించి వం
చన నపరాశఁగూడి మది చంచలతం జనఁజూచి ప్రాగ్దిశాం
గన నగినన్ రదద్యుతులు గ్రమ్మినకైవడిఁ దేజరిల్లెఁ గా
ర్కొను పెనుఁజీఁకటుల్ విరియఁ గొంత సుధాకరదీప్తి తూర్పునన్. 123

చం. హరుసిగబొందు పద్మనిచయమ్మునకార్తినమచ్చుమందు మే
లరసిఘటించు కల్వలకు నబ్బినవిందు పయఃపయోధిపు

ష్కరములు పుష్కరంబెనయఁ గాంచినకందు జగమ్ము మెచ్చఁ జం
దరుఁ డుదయించె కేటిచెలి తోడుగఁ దూఱుపుకొండ కొప్పునన్. 124

సీ. కలశాబ్ధిసుతు తనుగ్లాని పోఁగడుగుచో
 ధరకుడిగ్గిన సుధాధారలనఁగ
శశిరథోద్ధతిఁ బూర్వశైలద్రుమంబులు
 సుడియ వీడిన విరిసోనలనఁగ
పతిఁజూచి రోహిణీప్రభృతు లుబ్బునఁదాల్ప
 కొలఁకులంటని హారగుళికలనఁగ
రాజు తామసగర్వరాహిత్య మొనరింపఁ
 బేర్మిఁజూపిన వెండిబెత్తులనఁగ

తే. గీ. హరజటాపేటి విధుసఖ్య మమరెఁ దొలుత
నాకసమ్మున నిపుడబ్బెనుచు గంగ
పొంగఁ జదలేటి నవఫేనపుంజ మనఁగఁ
జంద్రికలు వ్రాలె ధాత్రి నిస్తంద్రగతిని. 125

చం. పనపుచుజక్కవల్ జతలఁ బాసి చరించె చకోరకమ్ము క
మ్మని కడిగాంచె పంకజసమాజమొగిన్ ముకుళించె పాంథభం
జనపరుఁడై మరుండు శరచాపము లోలిధరించెఁ బిండిచ
ల్లినగతి వెన్నెలల్ కొఱఁతలేక జగమ్ముల నిండియుండఁగన్. 126

సీ. అర్ధేందునిభలలాటాంతరమ్మునదిద్ది
 తీర్చిన కస్తూరితిలక మనఁగ
జిలుగుబంగరుశాలు జిగిఁజిందు మౌళిపైఁ
 బికిలికుచ్చులదండ పెంపుఁజూప
సరసచందనచర్చ సమకొన్న యురమున
 సిరిగాంచు ముత్యాలసరులు గదల
సారిది నెన్నడుమునఁ జుట్టినదట్టి చె
 లంగు లిర్వంకలరంగుఁ జూప

తే. గీ. శారికాకోకిలాళీమయూరభటులు
దండ నేతేర నిక్షుకోదండకుసుమ

కాండములు బూని శుకతురంగంబు నెక్కి
విరహిమృగముల వేఁటాడ వెడలె మరుడు. 127

తే. గీ. మలయపవనమ్ము డాయ వెన్నెలలు గాయ
భృంగసంఘమ్ము రొదసేయఁ బికవితతి గూయ
తుంటవిలుదంట క్రొవ్విరితూఁపు లేయ
సకియ సుమశయ్యఁ గనుమయ్యఁ జాలదయ్యె. 128

మన్మథాద్యుపాలంభము

వ. ఇట్లయ్యింతి మదనతాపమ్మునం బొరలుచు సఖులం జూచి. 129

మ. మునుభర్గుండు లలాటకీలల మరున్ బోకార్చియున్ గ్రమ్మరన్
దనరన్ జాలినయంత భిక్షుమిడ రీతన్వంగులం జల్క నం
గనలం జంపుటకై యనంగునకు సంగ్రామశ్రేణిఁ గల్పించి వం
చెనొ! కాదేని ధనుస్సుమాస్త్రచయ మేచేతన్ విడంబించెదున్. 130

వ. అని పరిశ్రాంతిం బల్కిన. 131

కం. నీలాలకజాల గుణా
వాల మహీపాలబాల వగపెఱిఁగి సఖుల్
దూలుచు శైత్యవిధానము
లోలిం గావింప నప్పుడొకసఖి పలికెన్. 132

సీ. మలయానిలాహతాకులమైన చెలిమేనఁ
జందనసలిలమ్ము చల్లవలదు
కుముదబాంధవ రుచిక్షుభితమౌ నురమున
ఘనసారరేణువుల్ గ్రమ్మవలదు
రతిరాజతాప లోహితములై తగు నేత్ర
ములఁ బద్మపత్రముల్ మోపవలదు
వరపికస్వరభీతిఁ బొరలుచోఁ బఱపునఁ
జూతపల్లవములు చొనుపవలదు

తే. గీ. తజ్జనిత్వమ్ము తన్నామధారణమ్ము
తచ్ఛరత్వమ్ము తత్ప్రియత్వమ్ము నెఱిఁగి
సేయు శిశిరోపచారముల్ చెలికిఁ దగునె
పగఱకూరిమిఁ గలవారు పగఱకారె! 133

వ. ఇత్తెఱంగున నత్తెఱవ మనస్తాపమ్మునకు నుత్తలంపడు చిత్తమ్ములతోఁ దరుణకిరణప్రసారవిజృంభితుండగు సుధాకరుంజూచి సరోషభాషణమ్ముల నిట్లనిరి. 134

సీ. అతివేలగుణగణోన్నతుఁడైన శంకరు
శిరముఁద్రొక్కిన దుష్టచేష్టితమ్ము
తొలుత దివ్యులకాత్మకళలు దానమొసంగి
క్రమ్మఱఁగైకొన్న కల్మషమ్ము
నతులవిద్యాప్రదుండగు దేవతాచార్యు
నిల్లాలిఁ గవసిన హీనవృత్తి
నీనామముధరించి నెమ్మివాటించిన
శిలల నీరుగఁజేయు చెట్టతనము
తే. గీ. కాని పనులిన్నిఁటికిఁ దలకట్టు తోడఁ
బుట్టువున్నట్టియిల్లరికటుకొనుట
మానినీమణి నేచక మానఁగలవె!
కలుషమూలమ్ము నీదారి కమలవైరి. 135

సీ. హంసాదిఖగముల కానందమొనరించి
శోకమిచ్చెదు చక్రవాకములకు
కుముదముఖ్యప్రసూనములకు సిరులిచ్చి
కుందొసంగెదు పద్మబృందములకు
బహుశైలపంక్తులపై నింపువాటించి
కరవుదెచ్చితి విందుకాంతములకు
యువతీజనమ్ముల నుల్లసిల్లఁగఁజేసి
వెతలేర్పఱించెదు విరహిణులకు
తే. గీ. పక్షపాతేచ్ఛ నీకిట్లు ప్రాప్తమైన
కళలకును బక్షపాతసంగతి పొసంగె
రాజవే! నీవు ధరణిఁగారణగుణములు
కార్యగుణముల కారంభకములుగావె! 136

చం. అమృతము కాలకూటము సుధాంబుధియందు జనించె నట్టిచం
దమునను నీవునుం బొడమినాఁడవు నీకు హాలాహలస్వభా
వము దిరమయ్యె నయ్యమృతవైఖరి యించుకలేదు భామినీ
క్రమకృతకల్మషం బొకటి చాలదె నిన్నుఁ గృశాంగు సేయఁగన్. 137

ఉ. రోహిణి మున్నుగా సతులు రూఢినొనర్చిన సువ్రతమ్ములన్
రాహుముఖమ్మునన్ వెడలి రాఁగలిగెన్ విరహాంగనాజన
ద్రోహము నిన్ను నబ్ధిఁబడద్రోయదె! మేనుకృశింపవన్నె! యీ
సాహసవృత్తి మానుమిది సౌఖ్యకరంబగునే సుధాకరా! 138

సీ. రాజవై నినుగన్న రత్నాకరము నేఁచు
బడబాగ్ని నుడుపని వెడఁగుదనము
డాయఁజీఱిన మాత్రదాయకై వడి భర్గు
తలకెక్కి నిలిచిన తులువతనము
చిఱులేటిఁగాని నేలఁజెంగలిఁ దిననీక
వినువీధి నడ్డపెట్టిన భవమ్ము
వితతవిద్యాసమన్వితుఁ జేయు నాచార్య
సీమంతినీమణిఁ జెందునఘము
తే. గీ. క్రందుకొను నీకు బహుళపక్షక్షయ ప్ర
సక్తి వాటించి విదలింపఁజాలవమృత
కిరణభరణమ్ము భవదీయశరణమగుట.
* * * 139

మ. గగనమ్మెక్కటి నెక్కి రాత్రిఁబగల్ గావింపఁ దాపంబునన్
మగువల్ కుయ్యిడ ధాతనీదుకళలన్ మార్చెన్ సుధావాప్తిచే
నగవారం డిగవారఁ గొంతకుశలం బీలీలఁ బూర్ణుండవై
జగతిన్ జాలయినన్ గరంచెదవు మాశక్యమ్మె జైవాతృకా! 140

చం. కలఁగక బాడబంబు నిజగర్భమునందిడుకొన్న తోయధిన్
గళగళఁ బొంగగాఁ గముచుకాఁకల గొన్నమవై హాళాహళిన్
హాలహాల మట్టణంచు హరునౌదల నెక్కి మహావిషంబవై
నెలకొను నీకు నిర్విరహిణీవధ దుష్కరమా! కళానిధీ! 141

ఉ. తమ్ముల చేవఁ జెక్కు గురుతల్పసుఖమ్మునఁ జొక్కి యాత్మకాం
తమ్ముల నీటఁ ద్రొక్కి జడదారి శిరమ్మున నెక్కి పాంథజా
తమ్ములమీఁద నిక్కి క్షణదావిహృతిం బయిలోటదక్కి చి
త్తమ్ముల నుక్కువుండనక తజ్ఞులు దూఱిన విక్కదే! శశీ! 142

కం. హరిణేక్షణ లిత్తెఱఁగున
సరసీరుహవైరి దూఱి సఖి వెత గని ని
ష్ఠురణాత్మఁ డనుచుఁ గ్రమ్మఱ
మరు నుద్దేశించి కుపితమానస లగుచున్. 143

చం. మదన! తురంగమా శుకము! మంగళకాహళమా మయూరము!
న్మదకరిబృందమా పికసమాజము! చంద్రసమీరులా ప్తుఁగా!
ప్రదరములా సుమమ్ములు! శరాసనమైక్షవమా! ప్రమత్వసం
పద లిటుగల్గియున్ సతులపాలిటి బూతమవైతి వక్కటా! 144

సీ. మధుపసంపదగుణప్రథితుండవగు నీకు
సరసధర్మగ్రహోత్సాహ మేల!
జడచారసాహ్యలక్షణశాలివగు నీకు
సన్మార్గవిహరణశ్రాంతి యేల!
రజనీచరత్వదార్జన్యమ్ముగల నీకు
మాధవాశ్రయణసంబంధ మేల!
కృతపద్మినీచయాహితవృత్తివగు నీకు
శుకవచఃపరిచయౌత్సుక్య మేల
తే. గీ. బాలికాచిత్త దుస్సహాభీల కీలి
కీల జాలోపమోదగ్ర కేళి సలుప
శరములేను ధరించె దుత్సాహమెసఁగ
శరమెఱుంగవు దుశ్చారి శంబరారి! 145

చం. అనుపమసౌరభమ్మున సుమాళి జగత్ప్రియ మాచరించి పే
ర్చిన సుమనోభిధానమునఁ జెన్నుదలిర్ప సగంధవృత్తి స
య్యన భవదీయసాధనములై కుసుమాహ్వయమంది డిందె దు
ర్జనసహవాస మీక్రియఁ బొసంగిన వన్నెయువాసి గ్రుంగదే! 146

సీ. వల్లవశ్రీ నోటుపఱుపఁ జూచెదవేనిఁ
బల్లవశ్రీ నోటుపఱుప లేమె !
మల్లీలతాంతమ్ము మఱల నేసెదవేని
మల్లీలతాంతమ్మె మనుపలేమె !
యబ్జమ్ము చేఁబూని యరముఁ జూచెద వేని
వదనాబ్జరోచులఁ బొదువలేమె !
కువలయంబని యేము దిప్పర నేసెదవేని
కువలయంబని యేము దిప్పరలేమె

తే. గీ. నీవశోకమ్ముగాని యుగ్రనియతిఁ బూన
నీవ శోకమ్ముగానధాటి నెరపలేమె
మార్గణములిట్లు వమ్మైన మార్గణములు
పరిహసింతురు నినుఁజూచి పంచబాణ ! 147

ఉ. తాలిమి చూఱఁబోవఁ బరితాపముఁ గూర్చెదు మానసమ్మునన్
బాలిశుఁడేనియున్ దనదుపట్టు దహించునె ! నిన్నుదూఱగా
నేల భవచ్ఛరీరమొగి నీశుని మిక్కిలికంటిమంటచేఁ
గ్రాలకకాలుటన్ గొఱవికైవడి వేడిమి సూపకుండునే ! 148

కం. ఘోరంబగు కుసుమశరా
సారమ్మునఁ గప్పి ధైర్యసారముఁ దప్పన్
బోరుడుగ వక్కటకటా !
మారుఁడవయ్యెదవొ మాకుమారుఁడవయ్యున్. 149

మానిని. ఫాలవిలోచనలోచనరోచుల భస్మమయంబై మేనొకటన్
సోలకవ్రాలక గాలిపిశాచము చొప్పునగుప్పునఁ గ్రొందలిరుం
గోలల గోలలనేయుచు డాయుచుఁ గోలుమసంగి యెసంగెదు నీ
శీలము జాలము గాంచిన ప్రాంచులు చెట్టని తిట్టరె భావభవా ! 150

తే. అనుచునొక్కట మీనకేతనుని రోష
భాషణమ్ముల నిరసించి భయదలీల
నెమ్మి నేతెంచు దక్షిణానిలము దలఁచి
తోయజాక్షులు నిందింపఁదొడఁగి రపుడు. 151

శా. రాణం గందవుగుబ్బలిం బొడమి సారగ్రాహివై సారస
శ్రేణిన్ సౌరభశైత్యసంపదల నాశ్లేషించి లోకుల్ జగ
త్ప్రాణుండంచు వచింతు రత్తెఱఁగు తథ్యంబైనఁ బాంథాంగనా
ప్రాణంబుల్ గొనసెట్టు లోర్చితివి దుష్ప్రారంభ ! మందానిలా ! 152

మ. అహితప్రార్థన మాచరించి మలయాఖ్యక్ష్మాధరేంద్రమ్మునన్
బహుభోగి ప్రకటస్ఫుటా మణిరుచిప్రాగల్భ్యముల్ మాని దు
స్సహదంష్ట్రావిషవహ్నిఁబూని విరహార్త్రాంతాంగనాంగవ్యథా
వహబుద్ధిం జనుదెంచెదింత కుటిలత్వంబేల మందానిలా ! 153

ఉ ప్రాణపదంబటంచు నిను భావమునన్ గణుతింపుచుండుదున్
ఘ్రాణసుఖమ్ము సేయుమికఁ గస్తురిరంగని మేనితావిచే
నేణము నెక్కి పొమ్మనట కీక్షణమాత్రనె యిమ్ము క్రమ్మఱన్
బాణియుగమ్ముసాచి నినుఁ బ్రార్థనచేసెద మారుతార్భకా ! 154

చం. అకలుషజీవనమ్మున మహాసరసుల్ దనరార దూఱెదో !
వికలసుఖంబుగాఁగ నడవిన్ సుమనస్తతి గెంటఁద్రోచెదో !
ప్రకటరజోవికాసమున భాసిలు కొమ్మలఁ గౌఁగిలించెదో !
అకటకటా మహత్తరుల కాకులపాటొదవెన్ సమీరణా ! 155

ఉ. క్రూరభుజంగచంగములు కోఱలు జీరలు వాఱఁజీఱఁగాఁ
బౌరుష మేది కాలునిలుపన్ ధృతిమాలి విరాలి జాలిపొం
గారఁ గలంగుచున్న యబలాళిఁ గరంచి మహాబలుండనన్
బేరును బెంపుగాంచుటిది పెంటితనమ్ముసుమీ సమీరణా ! 156

వ. అని యిత్తెఱంగున నిందుకందర్పమందపవనుల నిందించి తత్పరిసర
వర్తులగు మరాళచంచరీకశుకకోకిలమ్ముల నుద్దేశించి యిట్లనిరి. 157

సీ. కలుషించి విసముగ్రక్కెడు రాజహంసంబ
మలినమ్ముగాదె నీమానసమ్ము
కొదుకుపల్కులఁ బండ్లుగొఱుకకు కీరంబ !
యేవగించిన దీఱ దీఘలమ్ము

పానమత్తత నెదుర్పఁగరాకు మధుపంబ
తెలియఁజాలవు నీదు దేహబలము
పంచమస్ఫూర్తి గారించనేల పికంబ
పలుగాకులకుఁ దేటపడుకులంబు

తే. గీ. నేల నడవడి దప్పుదు రేల మొగము
గంటు మానుదు రేల మీ కాఱులరవ
రేల కన్నెత్తఁజేయరు మేలుమేల్వి
జాతులకుఁ బక్షపాత మెచ్చట ధ్రువంబు. 160

వ. అని యుపాలంభంబు సేయు నవసరమ్మున. 161

తే. గీ. ధరణిపతికన్య విరహసంతాపభరము
మది సహింపక వెన్నెలమడుపు సొచ్చి
తనువు దొరగెద ననుచు నుద్ధతివహింప
వలదు సాహసమనుచు నెచ్చెలులుగదిసి. 162

కం. పొదివికొని యూఱడింపుచు
మదవతు లారాజకన్య మఱలఁదిగిచి నె
మ్మది కుసుమశయ్యఁ జేర్చిన
మదనాశుగ తాపతప్త మానసయగుచున్. 163

శా. వ్యాకోచాంబుజలోచనల్ పొదివి యాశ్వాసించుపల్కుల్ మనో
వైకల్యమ్మున నొకింత మాన్చుతఱి దుర్వారస్ఫురచ్చంద్రికల్
పైకొన్నన్ వెత నశ్రుతోయకణముల్ రాలం గళంబెత్తి తా
శోకించెన్ గలకంఠి కోకిలరవస్ఫూర్తిన్ విడంబించుచున్. 164

కం. వికలమతి నెద్దియును దో
చక వగచుచుఁ జూచుచున్న జలజాక్షుల యం
దొక నీలవేణి యనఁజను
ముకురానన పల్కెఁ జెలియమోము నిమురుచున్. 165

మ. అకటా! రూపగుణప్రభావరుచిర వ్యాపారయోగమ్ములన్
బ్రకటింపందగు రాజకన్యక వికన్ గన్నీరుమున్నీరు సే

యుతు నీనాయకు రంగనాయకుని నెయ్యంబారఁ దోత్త్రము
త్సుకరాలాపము లొప్ప సేయుమని నౌత్సుక్యమ్ము వాటింపుమీ ! 166

సీ. హరిణశాబేక్షణ ! హంసమయూరాధూ
ర్తకుల నీకూర్చు న ర్తకులఁ జేతు
మధురోష్ఠి ! భయకంద మందమారుత రతి
ధవుల నీ విహితబాంధవులఁ జేతు
వనిత ! కోకిలమధువ్రత ముఖక్రూరవ
ర్తముల నీ గాయకోత్తములఁ జేతు
కాంత ! సంతాపదుష్కర చంద్రికాపేటి
కల నీదుకడఁ జేటికలుగఁ జేతు

తే. గీ. సతివ మును నీకుఁ బగవార లైనవారిఁ
జెలిమి నీకింక భృత్యులఁ జేయుదాన
రంగవిభు నిన్ను గూర్చి తెలంగొనస్తు
వగవవలదమ్మ యేనుగలుగ శుభాంగి ! 167

చం. చెలియ మనోవ్యథన్ వెతలఁ జెందఁగ నేటికి నన్ను మున్ను బెం
పలరఁగ నేలినట్టి ఋణమంతయుఁ దీర్చెద రంగభర్తతోఁ
సలపక నీగు సచ్చరితమంతయుఁ జెప్పి నిఁ తోడితెత్తు నీ
కెలమి ఘటించెదు నుజ్జనమూఁడిచ్చినా ఖేచరవిద్య పెంపునన్. 168

ఆ. వె. అసిన నీలవేణి యంబుజమృదుపాణి
మోహసాగరమున మునిగియున్న
నన్ను నుద్ధరింప నావ వీవైతివి
పోమ్ము రంగభర్తృపురమునకును. 169

కం. అని కౌఁగిలించికొని పో
మ్మనుపమగతి నీవువచ్చునంతకు నిచ్చో
టనె నిలిచియుండువారము
ఘనవిగ్రహు తోడితెమ్ము గమలదళాక్షీ ! 170

వ. అని యిట్లు సముచితసత్కారమ్ములం బ్రియమ్ము నెరపి మఱియు నయ్యింతింజూచి నీలవేణి! మనోభవపాణివిసృష్టమ్ములగు బాణవేణికల మునుగంజాల పోమ్ము చక్రపాణి నభిముఖుం జేయుమని యాజ్ఞాపించిన నయ్యింతి పిత్రుదత్తంబగు విద్యావిశేషమ్ము నవలంబించి నభంబున కెగసి చనం దొడంగె నంతనక్కడ. 171

శ్రీ రంగపతి విరాళి

చం. ఎలమి మరుండు రంగవిభుఁ డెంతయు రాజసుతన్ గురించి సం
చలితమనస్కుఁడౌ టెఱిఁగి సయ్యన నెయ్యపుఁ దియ్యవింట నే
ర్పలరఁగఁ బూన్చి సూనవిశిఖావళి పైఁబరగించు నంతకుం
దొలుత విపాండుపత్రరుచి దోఁచె మురాంతకు నెమ్మొగమ్మునన్. 172

తే. గీ. మును నృపాత్మజ చెలువమ్ము వినినయపుడ
నెఱి మరుండు జగద్భృతిమణి శ్రమంబు
దలఁగి యాత్మీయహృత్పీఠి నెలవుసేయ
రంగపతికిఁ గోర్కి యువతిపైఁ జెంగలించె. 173

కం. ఇవ్విధమున రాజాత్మజ
దవ్వుల నుండియును దనదు దండ నిలిచిన
ట్లెవ్వేళలఁ దోఁచిన మది
నవ్విభునకు విరహాభా నుగ్గలమయ్యెన్. 174

సీ. మంధాద్రిఁ బూని యంబరవీథిఁ జనుమేటి
విరహభారముఁ దాల్ప వోచుచుండె
వెఱిగినజలనిధిన్ బృథివిఁ దేల్చినదిట్ట
మోహాబ్ధి వెడల సందేహమందె
కినుక దావాగ్ని బ్రమింగిన మహాద్యుతిశాలి
దర్పకానలసముద్ధతికి నులికె
సకలదివ్యాస్త్ర తేజము లణంచెడుజోదు
నానరు పూఁదూఁపుల నోటువడియె

తే. గీ. చటుల భేరీసహస్ర ఘోషమున కోర్చు
ధైర్యధుర్యుండు కోకిలధ్వనికి నోర్చె

నహాహా ! యెటువంటి ఘనులకున్నైన నొక్క-
కాలమునఁ గొన్నివింతలు గలుగకున్న. 175

వ. ఇట్లు నీళావధూసుధురాధరరసమ్ము గ్రోల నుత్తలపడు చిత్తము నిలువనోపక ఫలప్రసూనకిసలయాభిరామంబగు నిజారామంబునం బ్రొద్దుగడపం దలంచి రంగవల్లభుండు విహంగపుంగవస్కంధంబున నిజకరాగ్రంబవలంబించి యుతం డొక్కరుండు సహాయుండుగా మందగమనంబునం జని సుమనోమనోహారంబులగు ననేకానోకహంబుల నవలోకింపుచు సంచరించుచో నొక్కయెడ రంగపతి విహగంపతితో నిట్లనియె. 176

ఉ. నాకు నెఱుంగఁజెప్పుమదె నాలుకలెల్లెడఁ గానుపించె ద
ర్వీకరవైరి ! యంచు హరి విస్మయమందఁ నతండువల్కె శో
భాకరమైన పల్లవచయంబిది చూడు మశోకమున్న, న
స్తోకవియోగిచిత్తమున శోకముసేయు నశోకమయ్యెనే ! 177

చం. రజ మొగఁజల్లి వేడిమి భరింబిడి పాతకులై వియోగికిన్
గజిబిజి సేయు దీని నెఱుఁగంజెపుమయ్య సుపర్ణ ! నావుడున్
భుజగవిరోధి నవ్వుచు ననూనసుమవ్రజ సౌరభంబునన్
బ్రజ నలరించు కేతకులు పాతకులే ! జగదేకనాయకా ! 178

ఉ. ఆతత పాంథశోణితమయాకృతు లేర్పడియున్న భూతసం
ఘాతము నిల్చెఁ గట్టెదుటఁ గన్గొను మీవన నీకు నిజ్జగ
ద్వ్రాతమునందు బూతమెదురంగలదే ! యివి నూత్నపల్లవ
ప్రోతములైన చూతములు బూతములే నవపద్మలోచనా ! 179

ఉత్సాహ. ఉల్లలద్బహుస్ఫులింగ కోగ్రలీల లేర్పడన్
క్రేళ్లువాతె నౌర ! వహ్నికీల పెంపనన్ బతి
ద్వల్లభుండు పల్కె-మెచ్చువచ్చు కోరకమ్ములన్
ఫుల్లవల్లికామతల్లి పుష్పవల్లి కేశవా ! 180

వ. ఇవ్విధంబునఁ బల్లవఫలకుసుమ విసరభారోదారంబులగు భూరుహంబు లంజేరి ప్రకటించు శుక కేకికోకిలాలాపమ్ములవలనను గమలసౌరభవిలసితంబై చను

దెంచుమలయానిలమ్మువలనను బచ్చపిట్టతుండదరించు విరిగుత్తులవలననం బొడమినయలజడికి న్గాలుసింగపంజాలక దాఁగుచున్న యన్నలువతెంద్రిన్ దోడ్కొనిచని యొక్కయెడఁ గుసుమితలవంగలతావేష్టితమ్ములును బుష్పితమల్లికావితానవిలసితమ్ములునగు నికుంజనిచయంబుల మంజులంబగు మధ్యదేశంబున శోభిల్లు తరుణచూతశీతలచ్ఛాయం గనుపట్టియున్న చంద్రకాంతశిలావిరచితంబగు వితర్దికోపరిభాగమ్మునం బఱచిన పల్లవశయ్యం జేర్చి ఖగేంద్రుండు నిజగరుదంచలంబుల నాయాసం బెడల విసరుచు నిట్లనియె. 181

తే. గీ. శుక మెఱుంగని ఫలములు పికము నోటఁ
గీఁటు లందని చివురులు తేఁటి తేన
లానఁగానని కుసుమముల్ హంసగరులఁ
జెదరని సరోరుహములు దెచ్చెద మహాత్మ! 182

క౦. అనుటయు రంగవిభుం డి
ట్లను పత్త్రరథావతంస! యల్లప్పుడె చె
ప్పనె కులశేఖరభూవర
తనయాసంభోగవాంఛ దలకొనె ననుచున్.

క౦. మదికి నది పల్వలంబై
నదియై మున్నీటితెఱఁగునన్ బెంపై యు
న్నది మోహరసము నేనా
సుదతిన్ వరియించుతెఱఁగు జొప్పడదనఘా! 184

సీ. ఆయింతికెమ్మోవి యమృతపానినఁ జాలు
సమధిక ఫలరసాస్వాద మేల
నామానినీమణి మోముమూర్కొనఁ జాలు
కమనీయపద్మసౌగంధ్య మేల
నాబోటి నునుజెక్కు లంటఁగల్గినఁ జాలు
పల్లవాలంబన భ్రాంతియేల
నాలేమఁ గౌఁగిట నలవరించినఁ జాలు
తనుపుష్పమాలిక దాల్పనేల

తే. గీ. యేల నిభములు తురగంబులేల హేమ
రచితరథ మేల రత్నహారమ్ము లేల
నేల నన నేల నీశావధూలలామ
గైకొనియె నేని నిన్నియుఁ గలుగవలయు. 185

చం. అనిన ఖగేంద్రుఁడిట్లనియె నక్కట దేవరవారి లానతి
చ్చినపని మాలిఁ దాల్చి కులశేఖరభూవరుఁ డాత్మకన్యకన్ గో
డ్కొని భవదీయసన్నిధికి గొబ్బున దానరు దేరకున్న ! యం
త నె కుశలమ్ముగ ల్గెడు వృథా విరహాశ్రమ మంద నేటికిన్. 186

తే. గీ. అనిన లక్ష్మీశ్వరుండు ఖగాధినాథుఁ
బలికె వినుమన్న మున్ను నే భావవీధిఁ
దెలిసియుండంగ నంకిలిగలిగె నొకటి
యదియు వినుపింతు నీకు నెయ్యంబెసంగ. 187

కం. ఏయువతికైన శస్త్ర
ప్రాయంబగు హృదయ మిందిరాదేవి సప
త్నీయోగమ్మున కోర్వదొ
కో యని వెఱఁజెంది యూరకుంటిని నసఘా ! 188

వ. అనిపలికిన వైనతేయుండిట్లనియె. 189

శా. శ్రీభూనీళలు మున్ సపత్నులగుచున్ సేవింప రే ! నిన్ను నీ
శోభామామణి దా వరించుటకు లీలన్ రాజకన్యాకృతిన్
శోభిల్లెన్ వెస నిందిరారమణి మెచ్చంగాక సంపద్యశో
లాభమ్ముల్ గృపసేయు దేవికి మనోల్లాసమ్ము గాకుండు నే ! 190

వ. అనుటయు ఖగవల్లభువచనమ్ములకుఁ గలంకదేఱిన మనమ్ముతో
వికసితముఖుండై మధుసూదనుండిట్లనియె. 191

కం. పతగేంద్ర ! నీసఖత్వము
కతనం జితమయ్యె హృదయగతసంశయ మ

యత్యతివం బరిణయమునకు సం
గతికిఁ బ్రయత్నమ్ము సేయఁగావలయు నికన్. 192

వ. అని పల్కునవసరమ్మున. 193

కం. నృపకన్య మున్ను పనిచిన
యుపకారిణి గగనవీథి నొగి నేగుచుఁ దం
గపతిం గనుఁ జెల్లెలా! యే
నెపమున భాషింపనగు ననేకజనులలోన్. 194

ఉ. ఆరమణీవతంసమున కాత్మహితమ్ముగఁ బెక్కు ప్రేలితిన్
దూరవిచార మించుకయుఁ దోఁచక రంగవిభుండు వేడ్క దే
వేరులఁ గూడియుండు తిరువీథుల నేగెడు వేళ చిత్రవి
ద్యారతు లేగుదెంతురు రహస్యవచోరచనల్ ఘటించు నే! 195

తే. అని వితర్కించువేళ నల్లదియె విరుల
తోట యచ్చోట ఖగరాజుతోడ రంగ
నాయకుఁడు సంచరించుచున్నాఁడు సిల
వేణి! పొమ్మంచు నశరీరవాణి పలికె. 196

ఉ. ఆపలుకుల్ మనమ్మునకు నచ్చెరుపాటు ఘటింప నభ్రవీ
థీపథ ముజ్జగించి జగతీస్థలికిన్ వెసడిగ్గి వార్ధిక
న్యాపతి సంచరించు తెఱఁగారసి నిల్కడ వేళఁగాని నే
నాపృథివీశపుత్రి చరితామృతమున్ జవిచూప నెట్లగున్. 197

వ. అని తలంచుచు. 198

కం. అంతట నొకయారమ్మున
నంతర్హితలీలఁ దాల్చి హా! సీతాసీ
మంతిని యనికూర్చున్న ము
రాంతకు పలుకాలకించి యతివ మనమునన్. 199

ఉ. ఎక్కడివింత భూపసుత నెన్నడుచూచె భ్రమంబుఁ జెందె! సీ
చక్కని సామికిం జెలియ చక్క దనమ్ము మదిం ఘటింప న

ల్దిక్కులనుండి ప్రమ్మఱు సుధీమణులెవ్వరుపూనిరో కొ నే
మ్రొక్కి యెఱుంగఁజెప్పుటకు మున్నె యెఱుంగఁగనయ్యె నయ్యెడన్. 200

కం. అనుచు భయసంభ్రమంబులు
దనమది ముప్పిరిగొనంగఁ దరుణీమణి య
ల్లన నడుగులిడుచుఁ జనియెన్
వినయాన్వితయగుచు రంగవిభుఁ డున్నెడకున్. 201

తే. గీ. వచ్చుచున్నట్టి విరిబోఁడివలను సూచి
భూపకన్యక హృదయసంతాప ముడుపఁ
దలఁచి యేతెంచు సఖిగాట దనదుదివ్య
చిత్తమున గోచరించె లక్ష్మీవిభునకు. 202

సీ. పరిపూర్ణచంద్రబింబము నందు నెరసులె
న్నఁగఁజూచు సుందరాననమువాని
శరదుల్లసత్సరోజదళమ్ముల హసించు
విపులవిశాలనేత్రములవాని
కమనీయపద్మరాగమణిద్యుతుల మించి
రాణించు సరసాధరమ్మువాని
భూరికుంజరకరస్ఫూర్తినోడించు న
త్యున్నతదీర్ఘబాహువులవాని

తే. గీ. చెన్నెసఁగు చిన్నినగవులు వెన్నెలలకు
నన్నలునుదమ్ములును జేయునట్టివాని
రమ్యమగు శయ్యఁగూర్చున్న రంగవిభునిఁ
గాంచెఁ బూబోఁడి కన్నులకఱవుదీఱ. 203

చం. కని భయకౌతుకమ్ము లెసఁగన్ వెసఁగ్రమ్మిన సమ్మదాశ్రువుల్
కనుగవనిండఁ బర్వితొనుకన్ గొలుకుల్ నిలుపోపలేమిఁ జ
య్యన నునుజెక్కులం బొరయ నంగకముల్ పులకింప రంగధా
ముని చరణాంబుజమ్ములకు మ్రొక్కె సరోజదళాక్షి గ్రక్కునన్. 204

క. మ్రొక్కి నిలిచి యాదేవుని
వెక్కసమగు తేజమునకు వెఱచుచు మదిలో
స్రుక్కి తలవాంచి పలుకని
యక్కోమలి తెఱఁగెఱింగి హరి యిట్లనియెన్. 205

ఉ. ఎందు వసించుదానవిట కేగతి రాఁబని యేమి కుందమా
కందమధూకచంపకవికస్వరవాసన విందుగోరి నీ
విందుఁ జరించెదో కొమ్మ! మఱి యింకొక కార్యభరమ్ముపూని యీ
చందమునన్మెలంగెదవొ చంద్రముఖీ! భయమంద నేటికిన్. 206

తే. గీ. అనుచు రంగేశుఁ డానతిచ్చిన మృగాక్షి
ముదము సంధిల్లఁ గరములు మోడ్చి పలికె
సద్గుణాధార! సాధురక్షణవిచార!
కూర్మిఁ దలకొత్త మనవి చేకొనఁగవలయు. 207

### నీలవేణి నిజవృత్తాంతము శ్రీరంగపతికి విన్నవించుట

క. శ్రీనిలయ! నీదుసన్నిధి
నే నెంతటిదాన నట్టిదిట్టిదియనఁగా
నైనను నాకసందేహము
పూని యిటువచ్చితిని ప్రభూతారాధ్యా! 208

ఉ. హేలి నరాతినిర్మథనహేతుపరాక్రమశాలియై యశ
శ్శ్రీలదయానుభావముల చెల్వగు చొక్కులశేఖరావనీ
పాలునిదేవియైన కులపాలికకున్ జనియించి బాల తో
భాలలితాంగియై పెరిగె బాలసుధాకరరేఖ వైఖరిన్. 209

సీ. ఆయింతి కుచగౌరవాహతిఁ గనికాంచె
గజకుంభములు ధూళిఁగప్పికొనుట
యాలేమ ముఖకాంతిఁ బోలఁజాలక కదా
వనజారి కను కృశత్వమ్ము నొందె

యానాతి లోచనశ్రీ నోటువడికదా
కమలముల్ జలములఁగదలకుండె
నాబోటి పలుకుల యులవెఱుంగకకదా
చిలుకలు పంజరంబుల వసించె

తే. గీ. నాచలచ్చూర్ణకుంతల యంఘ్రియుగళి
నులికి చివురులు శాఖాగ్రములఁ జలించె
నా వళలికి మధ్యభాగావలోకనమున
బెదరికాదె మృగేంద్రముల్ బిలముసొచ్చె. 210

వ. ఇవ్విధమ్మున నయ్యింతి చెలువమ్ము గొంతకొంత వెఱింగించి రమా
కాంతునితోనిట్లనియె. 211

తే. గీ. మతికొలఁది నింతి యవయవప్రతతిఁ బోల్పఁ
దోఁచె నివికొన్ని సదృశవస్తువులు సాటి
మున్న తెలిసిన సర్వజ్ఞమూర్తి వీ
వెఱింగినదు నాకుఁదెల్పవే! రంగనిలయ! 212

వ. అనిన రమావల్లభుండిట్లనియె. 213

తే. గీ. లేమ సుగుణమ్ములెన్న పులోమజాది
సతుల నెఱుఁగవె పత్నిప్రశంస సేయ
నాకు నుచితంబె చెలియసౌందర్యమహిమ
నీవెచెపు మేనువినియెద నీలవేణి. 214

కం. అని తనునియామించిన న
వ్వనజాయతనయన రంగవల్లభుని గనుం
గొని చెప్పఁదొడఁగె భూవర
తనయామణి రూపసంపదలు తెలియంగన్. 215

మ. రమణీవేణికపై నెదుర్చు మధుపవ్రాతమ్ముల న్మారుఁడ
తుముఁడై త్రోఁచిన వ్రాలి కట్టెదుట రాజన్నాసికాచంపక

భ్రమదోఁపన్ వెఱగంది వక్త్రశతపత్ర ప్రాంతయుక్తిన్ సఖి
త్వము వాటించెననంగ ముంగురులు దత్ఫాలమ్మునన్ బొల్పగున్. 216

మ. తనముఖ్యాస్త్రము లింతిలోచనములై తత్తద్వ్యావాంతర్విభే
దనమున్ దృక్ఛరపంక్తిచేఁ బెనుపఁ గందర్పుండి కేలంచు వై
చిన పుండ్రేక్షుశరాసనమ్ములు కృతస్నేహములై యక్షివ
ద్మని దేశమ్మున నిల్చినట్లెసఁగె సమ్యగ్భ్రూలతల్ బోటికిన్. 217

చం. విరహితసౌరభంబగుచు వెల్వెలఁబాఱు దిలప్రసూనమున్
జరదళిసంఘసంగతిఁబొసంగని చంపకమున్ దలంచి ని
ర్భరబహుగంధలబ్ధి ముఖపద్మవిలోలమధువ్రతాప్తి దా
నరసి మృగాక్షినాస పరిహాసమొనర్చు నిజోపమమ్ములన్. 218

మ. నవసంఖ్యాకృతితో ననంతగుణమాన్యమ్మై శ్రుతిప్రఖ్య ద
మ్మవలంబించుట వీనులెన్న శతపత్రాకారమున్ రూపరూ
పవదర్ధగ్రహశక్తి మాకె తగు గర్వం బేలనం చింతి క
న్గవ కిన్కన్ గడఁద్రోయు నట్టులమరెన్ గర్ణాంతవిశ్రాంతమై. 219

తే. చిలుక ముక్కునఁ జిందరల్ సేయునట్టి
దాడిమీబీజములు ముంటి దారిఁ జూపు
ముత్తెములు విచ్చిచను మొల్లమొగ్గగుంపు
రహి సమంబులె పూఁబోడి రదనములకు. 220

ఉ. ఆరమణీముఖంబు సరియందురు మోవికిఁ జాలసంచు నం
భోరుహమంబులం దపముబూనుట రాగముజెంది రత్నమై
నీరసమౌటకున్వగచి నిష్ఠురమైనగతిం దపించి ని
ర్భీరుత బింబమై యధరబింబమనం జను కంబుకంఠికిన్. 221

ఉ. స్థాణుశిరమ్మునన్నియతిసల్పి తమంబెడలన్ బుధాన్నవి
శ్రాణన మాచరించి జనరంజనతన్ శుభుఁడయ్యెఁ జందురుం
డేణము దాల్చియున్కి హరిణేక్షణ ప్రసన్నిమోము సాటికిన్
నాణెముజెందఁడయ్యె నలినంబది పంకజ మెన్న నేటికిన్. 222

కం. వదనము ఘనసారస్వత
పదనిగళము గళము రుచిరపటుశంఖకళా
స్పద మాపదంబు వేనలి
మృదుబిసకాండమ్ము లంబుజేక్షణ భుజముల్ 223

సీ. సౌవర్ణకలశముల్ సరివచ్చు శిఖశిఖా
క్రమణకల్పితములు గాకయున్న
వనజకోకము లెన్నవచ్చుఁ జంచలచంచ
రీకరేచితములు గాకయున్న
గజకుంభములు సాటిగాంచుఁ దుండోజ్ఝిత
గ్రాసధూసరములు గాకయున్న
శైలాగ్రముల్ బోల్పఁజాలు నిమ్నోన్నతా
కారఘోరమ్ములు గాకయున్న

తే. గీ. కాంతిసౌష్ఠవ సమతాతిశయిన భావ
కలన నొక్కొక్కధర్మంబు గలుగఁజూచి
కొంతతెలుఁగక పూఁబోడి కుచసమాన
ఫణితి నెన్నుట యుచితమే ప్రాజ్ఞులకు. 224

మ. ప్రబలంబై చెలి యావనామృతఝరుల్ పైపై మెయింబర్వ నా
భి బిలావర్త విఘట్టితాహి వెలి నుద్వృత్తిఁ బయల్నాకుచుల్
సొబగొప్పన్ వళివీచిక ల్గడచి యచ్చోటన్ సగంధ స్తన
స్తబకాంతస్థితిఁ గాంచెనాఁ జెలికి నందంబయ్యె నూఁగారొగిన్. 225

తే. గీ. గగనమై తోఁచు నయ్యింతి కౌనుతీఱు
స్వాతిపథమందు మౌక్తికస్థగితకాంచి
కొసల వ్రేలెడు వజ్రంపుగుంపులెల్లఁ
జుక్కలై తోఁచు నయ్యింతి సొబగుతెఱఁగు. 226

చం. వలుదమెఱుంగుచన్ను లిరువంకలఁ గాంచనకుంభముల్ బొమల్
సలలితచాపముల్, గళముశంఖము పల్కులు కోకిలోక్తు లి
ట్లలరెడు గాంతమేను కుసుమాయుధుఁడుండు పసిండితేఱు సం
చలితరథాంగ మింతికటి శాతశరమ్ములు చూడ్కు లెన్నఁగన్. 227

తే. గీ. రమణి రూపమ్మునకు నోడి రంభయొకతి
యులికి కనుముయ్యదయ్యె వేఱొండు రంభ
కన్య యూరుభయంబునఁ గదలికదలి
కదళి యనుపేర నేఁటికిఁ గదలుచుండు. 228

కం. ఆహితగుణజంఘులకును
గూహాళమున నోరు దెఱచికొని కలహాకళా
మోహమున నఱచుచుండెడు
కాహళములఁ బోల్ప నుచితగతియే చూడన్. 229

చం. సరవిఁ బ్రవాళ మాత్మరుచిసంపదపేర్మిఁ దదీయవిస్ఫుర
చ్చరణతలమ్ములం గెలుచు సాహసమూఁది నిజాంగసంగి ని
ష్ఠురతఁ దలంచి క్రమ్మఱినచోఁ దనమార్దవరాగయోగని
ర్భరత నెదిర్చి పల్లవము పల్లవమయ్యె సరోజసంధికిన్. 230

కం. ఆయింతి రూపగుణరే
ఖాయుతసౌష్ఠవము తోఁచినంత తెలిపితిన్
వేయేల నీకుఁదగు చెలి
తోయజముఖి కీవు దగుదు తుల్యాకృతులన్. 231

ఉ. స్వాములు మున్ను కొందఱు భవద్గుణరూపవిలాసముల్ నృప
గ్రామణి చెంగటన్ దెలుపఁగాఁ బితృసన్నిధిఁ బాయకున్న క
న్యామణి విన్నమాత్ర హృదయంబున మత్పతి నిర్జితాహిత
స్తోముఁడు రంగభర్తయనుచుం దలఁచెన్ దమి చెంగలింపఁగన్. 232

కం. రంగాధినాథ ! చటులవి
హంగేంద్రతురంగ ! విలసితాంగజనిభది
వ్యాంగ ! నినుబొందుటకు నీ
శాంగన తపియింపుచున్నయది మదిలోనన్. 233

ఉ. హా ! జగదీశ చాలతడవాయెగదా యిటకేను వచ్చి యా
రాజకుమారి సాహసికురాలుగదే ! తనువల్లి యింత కే

రోజకుఁ దెచ్చునొక్కొ— మరుఁడుద్ధతుఁడోర్చునె ముద్దరాలు ! వి
భ్రాజితదివ్యమూర్తివి కృపన్ సెలవిచ్చినఁ బోయివచ్చెదన్. 234

మానిని. కోకిల కోక బలాక కులార్భటిఁ గొందల మందెడిడెందమునన్
దీకొను గంధపుగుబ్బలిఁ బ్రమ్మిన తెమ్మెరతావుల యుమ్మలికన్
పైకొని చిన్నెల యన్నెలవెన్నెల పర్విన నోర్వఁబ వేదనఁన్
ఆకలవాణి తపింపకయుండునె ! యారనిపోరిది లోకపతీ ! 235

కం. అని నీలవేణి పలికిన
వినయోచితవచనరచన విని యుత్సాహం
బున హృదయమలర నవ్వుచు
వనజాక్షుం డిట్టులనియె వనితామణితోన్. 236

ఉ. సంగతిమీఱ సభ్యులు ప్రసంగవశమ్మున మెచ్చుచున్న నీ
శాంగన రూపసద్గుణ సుధాంబునిధిన్ మదిడిందఁయున్న న
న్నంగభవుం డెఱింగి కుసుమాస్త్రము వేయఁ గలంగి కాదె నా
రంగ లవంగలుంగ వనగంగవిహారము గల్గె ! గోమలీ ! 237

ఆ. ఇంగితజ్ఞురాల ! యిఁక వేయు చెప్పంగ
నేల యేనయటకు నేగుదెంచి
క్షితితలేంద్రతనయఁ జేకొనియెద వేగఁ
జనుము చెలియ సంతసమున నెనయ. 238

వ. అనుటయు. 239

కం. స్వామీ ! మా రాతనయకు
సేమం బెసగంగ ముదము చెన్నువహింపన్
శ్రీముఖపత్రిక యొసఁగుము
నా, మధుదైత్యాంతకుండు నగుచుం బలికెన్. 240

ఉ. అంచిత సౌరభ స్ఫురితమైన మృగీమదకర్దమంబు సీ
లించి సమంచితాత్మనఖలేఖినిచే నొక వృత్తపద్ధతిన్

గాంచన కేతకీ కుసుమగర్భదళమ్మున వ్రాసి లేమ కి
మ్మంచు నొసంగె నాతట మురారి సువాణికి నీలవేణికిన్. 241

వ. అని యిత్తెఱంగున రంగపతి యానతియిచ్చి విహంగపుంగవ సమర్పితంబగు లేఁజివురులం బొదివిన కుసుమమాలికానిచయమ్ము నీలవేణికి సబహుమానమ్ముగా నొసంగి నీలావధూమణి నూఱడింతువుగాని పొమ్ముపొమ్మని యానతిచ్చిన నెలంత శ్రీకాంతునకు మ్రొక్కి యమ్మహాత్మునిచేత ననుజ్ఞాతయై సభమ్మునకు నుద్గమించి చనునెడ నంతనట నీలావధూటి విరహభారపరిశ్రాంతయై యుండుటం జేసి నెచ్చెలులతో నిట్లనియె. 242

శా. ఆకల్లార్పఁ దొడంగె మందపవనుం డందంద సూనాస్త్రభృ
ద్రాకాచంద్రులు దోడ్పడన్ గినుకచే, రానోపునే! తద్భయో
ద్రేకక్షాంతికి నీలవేణి, విభుఁ దోత్తెఱంగ నేగన్ బనుల్
గాకున్నన్ గద రాకయున్కి యని యక్కంజాస్య చింతింపఁగన్. 243

వ. అనిన నచ్చేడియతో నెచ్చెలులిట్లనిరి. 244

కం. బాలామణి! మది నెఱుఁగక
నీలో వగపేల కార్యనిర్వాహణకళా
శాలినియై సేమంబున
నీలోనన నీలవేణి యే తేఱంగన్. 245

సీ. చొఱనీయవలెగదె శుద్ధాంతమందిర
ద్వారసంస్థిత మహోదగ్రభటులు
నెడమీయవలెగదె యిందిరావిభుఁ గొల్వ
బడిబడి నేతెంచు భాగవతులు
మాటాడవలెగదె మదనమోహనమూర్తి
తేటకన్నుల నింతిఁ దేఱిచూచి
తలయూఁచవలెగదె తగినకార్యంబంచు
తాల్మి చేవలయూరు తల్లిగారు
తే. తెలివి నూహింప నిన్నిపట్టుల నిజప్ర
సంగభంగుల సవరించి రంగవిభుని

మానసమ్మున నీమీఁది మమతఁ జేర్చి
వేగ నేతెంచు మననీలవేణి యబల! 246

వ. అని యిత్తెఱంగునఁ జెప్పిరనిన గురువర్యునిం జూచి శిష్యప్రవరులు తఱువాతిచరితంబెట్టిదనిన వినుఁడని చెప్పఁదొడంగె. 247

శా. సుగ్రీవానిలనందనాది సుభటస్తోమప్రియోత్సాహ! పం
క్తిగ్రీవేంధనవీతిహోత్ర! విబుధక్షేమావహా! శంకరో
దగ్రేష్వాసనిరాసభాసుర! జగత్ప్రఖ్యాతచారిత్ర! ర
త్నగ్రైవేయకముఖ్యభూషణ లసత్సౌందర్యపాథోనిధీ! 248

కం. రాజద్రాజతనగ సుర
రాజేభాజాశ్వ భుజగరాజ త్రిదివ
భూజ మృగరాజ ధవళాం
భోజ ద్విజరాజ సదృశ పుంఖితకీర్తీ! 249

మాలిని. అనుపమగుణసాంద్రా! హంసవంశాబ్ధిచంద్రా!
వినిహతరిపుసేనా! విప్రపుత్రాసుదానా!
మనసిజరిపుకాయా! మానుషార్చావిధేయా!
జనకనృపకుమారీ! సమ్యగానందకారీ! 250

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణానిరీక్షణ సమాసాదితకవితావిశేష శేషాన్వయ ప్రదీపక వేంకటాచార్యకుమారక రఘునాథాచార్యప్రణీతంబైన కులశేఖరమహీపాలచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము. 251

---

# కులశేఖర మహీపాల చరిత్ర

## చతుర్థాశ్వాసము



శ్రీరమ్యమకుటరత్న
స్ఫారద్యుతి విజితభానుభానువ్రజ! లో
కారాధకీర్తిసౌరభ!
సారగుణావేశ! జనకజాహృదయేశా! 1

వ. అవధరింపుము గురుసర్యుండు శిష్యులకిట్లనియె నట్లన్నెలంత విరహభారమునఁ బొరలుచున్న యెడ. 2

### నీలవేణి సీతాదేవియొద్దకు వచ్చుట

మ. హరిహస్తాబ్జ నియుక్త నూత్నకుసుమోద్యన్మాలికావాసనల్
సరవిం బైపయిఁ గ్రమ్మ దేరఁ జెలులాశ్చర్యమ్మునన్ నల్దెసల్
బరికింపన్ దివి నీలవేణి ననువొప్పన్ గాంచి రచ్చో నభో
తరనిర్యన్నవచంద్రరేఖయన నుత్సాహమ్ము వాటింపగన్. 3

ఉ. రంగవరేణ్యదత్త సుమరాజి సువాసన మున్నె సంగఁగా
నింగి దొఱంగి వేదన మునింగి మనంబు గలంగియున్న సీ
తాంగన సంతసిల్ల ధర సంభ్రములిడన్ డిగివచ్చు నీలవే
ణిం గని బాలికామణుల నెమ్మనముల్ వికసించెఁ గ్రక్కునన్. 6

ఉ. కాంచితిఁ గాంచనాంబరు వికస్వరవిగ్రహుఁ గాంచికాగుణో
దంచితమధ్య రంగవిభు నద్భుతమందుచుఁ జెంతసేరి సే
వించితి నీదు రూపగుణవిభ్రమవైఖరి సారెసారెఁ గీ
ర్తించితి నిన్నతం డరుగుదెంచి వరించుట సంఘటించితిన్. 7

కం. అను పల్కు లమృతరసమై
తనవీనులఁ జొచ్చి హృదయతాపముడుప న

మ్మనుజేంద్రతనయ కుతుకము
దానుకఁగ నస్మిలనేఁకతో నిట్లనియెన్. 8

ఉ. ఇందునిభాస్య! రంగవిభు నెయ్యెడఁ గాంచితివీవు సూచి యే
చందమున న్వచించితివి సారె పరాకొకయింతలేక గో
విందుఁడు చిత్తగించెనె! విభేదవిచారులు గొందఱెయ్యెడన్
జెందరుగా! ననున్ గరుణ చేకొనవచ్చునకో తలోదరీ! 9

వ. అనిపలికిన నీలవేణి యిట్లనియె 10

ఉ. రాజముఖీ! మనోహరుని రాకలకున్ వగపేల మేఘవి
భ్రాజితమూర్తి నీదుపరిరంభము గోరుచునున్నవాఁడు ము
న్నే జప మేతపంబు రచియించితొ! తత్ఫల మబ్బె నేఁడు న
వ్యాజమనోజగాథ లెడనెయ్యెఁ జుమీ జలజాతలోచనా! 11

కం. హరిఁగాంచి వేడుకొనుటకు
నరవిందదళాక్షి మీర లట్లనువ సహాం
తరవీథిం జనఁగ విభాం
కుర రుచిరములైన మణులు కురిసెన్ మీఁదన్. 12

వ. అప్పుడేను వెఱగుపడుచుండ నంత. 13

ఉ. మానవతీ! మతిన్ వెఱపుమానుము మింటఁ జరించు సిద్ధవై
మానికదంపతుల్ మణిసమాజము వేడుక సారె దోయిటం
బూని సమంబు జేసియగు బొమ్మని క్రీడయొనర్చుచున్న నీ
పై నొకకొన్ని రత్నములు బ్రమ్మిసచో వెఱగంద నేటికిన్. 14

వ. అనుచు నిరువురు సిద్ధాంగనలు శుభాంగీ! నీయత్నమ్ము శుభోదర్కం
బగుం బొమ్మని మత్పార్శ్వంబునం బలికి నిజేచ్ఛం జనుటయు. 15

తే. గీ. అపుడు పొడవున నరుగుచో నసఁదుటికి
లెల్లఁ గనుపడె గంపంత లేసివగుచు
మహి నిరీక్షింపఁ దుంగభూరుహములెల్లఁ
దుంగపాచల భంగిఁ గానంగఁ బడియె. 16

చం. పటుగతి నేఁగుచో నెదుట బారులుదీఱు చకోరకమ్ము లు
త్కటరవ ముల్లసిల్లఁ దమదండలనుండెడు పిల్లపింఛ ముం
దట నెగువంగ సారసముదంచిత కోమలచంద్రికావళిన్
గుటగుట గ్రోలుచుక్కి గనుగొంటి మదీ ముదమగ్గలింపఁగన్. 17

వ. అంతఁ గడచి చనుచున్న యెడ విబుధావాసభాసురంబగు మేరునగమ్ము చందమ్మున మహాభాగవతమణిమందిర మాలికాలంకృతంబైన రంగనగరంబు దవ్వు దవ్వులం గనంబడియె నంత భేరీపటహ శంఖాదినినాదమ్మును నటనటీజనప్రవర్తిత వేణువీణాగానరావంబులును మహాభాగవత ముఖోదీరిత దివ్యప్రబంధానుసంధాన ధ్వానంబులునుం గలసి వీతెంచిన నమ్మహావైభవంబునకు నద్భుతంబంది వినుచున్నంత నామనంబున. 18

కం. ఇట్టిమహావిభవంబున
నెట్టణ విలసిల్లు రంగనిం గనుచుంగం
బెట్టిది చెలికత యే నే
పట్టున వినిపింప నేర్తు బహుసంఘముఁలో. 19

వ. అని వితర్కించుచున్న యెడ. 20

కవిరాజ. సలలితకీర్తి పోసంగెడు వేళ విచారముపొందెద వల్లదిగో!
ఫలకుసుమాసవ సౌరభవైభవ భాజన భూజసమాజములన్
బొలుచు వనంబు కనంబడుచున్నది పొందుగ నందు ఖగేంద్రునితో
నెలమి వసించె రమారమణీవిభుఁ డిందుముఖీ! చను మచ్చటికిన్. 21

వ. అని యశరీరి యాదేశించిన పలుకులకు డెందం బానందకందళితంబగుటయు గగనపథావతీర్ణమ్ము చేసి యవ్వనంబు చేరంజని యందుఁ బ్రసవవిసర విలసితంబులై పొదలు పొదలలోనం గూర్చున్న యన్నళినలోచను నాలోకించునప్పుడు నామనంబున. 22

కవిరాజ. అలికులవేణుల వేణులకుం బిరులాని తాఁ గొనివచ్చుటకై
యళికుల మాకులమందఁగ నిప్పని యప్పనికిందగునే యనుచున్
దలఁచితిఁ గ్రమ్మఱఁ దోఁచె నెఱుంగక తప్పఁదలంచితి సీతనికిన్
గలుగరె భృత్యులు దీనికి వేఱొకకార్యము గల్గునటంచు మదిన్ 23

కం. అని నేను నమ్మహాత్ముని
కనుగొనుచున్నంత విపులకాంతా విరహో
పనతశ్రాంతిఁ జరించుట
కననయ్యెన్ మరుఁడు పాపకర్ముఁడు గాఁడే! 24

సీ. రమణీయసుమరజోరాజి రాజిలుచోట
సొలయుచు నేళించి తొలఁగుసమ్మ
లలితకోకిలశుకాలాపముల్ వీతేర
గరములఁ గర్ణముల్ గ్రమ్ముసమ్మ
మృగనాభిసౌరభోన్మేషసాంకవశిలా
వితతుల డాయంగ వెఱచునమ్మ
ఘనచంద్రికాజాలకలితస్థలమ్ముల
నులికి వృక్షచ్ఛాయ నొదుగుసమ్మ

తే. గుంజదళిపుంజ కలహంసకోకనిచయ
రుచిర నవపద్మకుముద సరోవతంస
మిళిత మరుదంకురములకుఁ దలఁకునమ్మ
యంగజశ్రాంతచిత్తుఁడై రంగవిభుఁడు. 25

కం. అదియెల్లఁ జూచి నామది
నొదవె విచారమ్ము విరహయోగశ్రమ మి
ట్టిదకాదె యితనిమది యే
మదిరాననయందుఁ జెందె మమతదలిర్పన్. 26

మత్తకో. సంగతంబగుచుం దరంగము సైంధవంబగుగాని తా
రంగమే జలరాశిలోకము రంగభర్తృకృతమ్ముగా
నింగితజ్ఞు లెఱింగి కొల్చెద రింపుసొంపు వహింప న
య్యంగహీనుఁ డెఱుంగఁ డంగ రథాంగపాణి నలంచెడున్. 27

ఉ. ఈమహనీయమూర్తిమది యేమదిరాననయందుఁ జెంది వి
శ్రామములేక నెవ్వగఁ బొసంగిచరించెనొ! చూచిచూచి యే
నేమని మాలతాంగి కతలేర్పడఁ జెప్పుదు! నిప్పుడీ గుణ
గ్రామణి పల్కునే యిది యగాధమనోరథ మేమిసేయుదున్. 28

తే. అనుచు మదిసంశయింపుచు నచటనిలిచి
పలుకరింపఁగఁ దగువేళ గలుగనంచు
మంజుసుమపుంజ మాధవీకుంజ మొకటి
మాటుగొని చెంతనిలిచితి మగువలార ! 29

కం. అంత వసంతశయాను శ
కుంతవరేణ్యుండు కుసుమకోమలశయ్యా
భ్యంతరమున నునిచి పరి
శ్రాంతి యుడిపె నిజగరుద్వ్యజన పవనమునన్. 30

కం. అతఁడు గూర్చుండునప్పుడు
కౌతుకక నన్నేచ నేఁ గులశేఖరభూ
పతిసనయా ! యని విరహా
న్వితచిత్తుండగుట మఱియు నిను బేర్కొ సియెన్. 31

వ. అప్పలుకులు నాకుం గర్ణగోచ మ్మలగుటయు నామనమ్మున విస్మయంబొదవ నొక్కింత విచారించి యిమ్మహాత్మ్మ డమ్మదవతిజూడకుండియు న్నృపసన్నిధికిం జనుదెంచు సుభీమఖ లయ్యెంతిం జూచు మందుమరుగావునఁ దత్సౌంద ర్యాదిగుణమ్ము లిమ్మహాపురుషుప సన్నిధానంబున నుగ్గడించుకతంబున నితండు నీలాంగనాపరిష్వంగసుఖ తృష్ణికాంతరంగుడై కుసుమశరవేదనాపరిశ్రాంతుండయ్యెం గావలయునని నిశ్చయించి మఱియును. 32

కం. సార్థక మే నరుదెంచుట
నిర్ధారితమయ్యెఁ గార్యసిద్ధ్యాహము పు
ణ్యార్థి వెస నాడఁబోయిన
తీర్థ మెదురొ్క్కనుట యని మదిన్ ముదమొదవెన్. 33

మ. కలకంఠీమణి ! యప్పుడేనతని యుత్కంఠన్ వితర్కించి ద
వ్వులచూడ్కిన్ బని యెట్టులో నతనిచెయ్యాల్ భావమున్ గాంతు నం
చలరుందూఁపుల వెల్లు తండ్రికడ కే నందంద డాయంగఁ గ్రొ
న్నెలరాల్గూర్చిన తిన్నియన్ జివురువన్నె ల్మించు తల్పమ్మునన్. 34

సీ. శతపత్రపత్రసౌష్ఠవము మెచ్చని దయో
దాం విశాలనేత్రముల వాని
బంధురరత్నదర్పణపాళి నోడించు
లలితకోమలకపోలముల వాని
బలభిన్మణిస్ఫురత్ఫలకమ్ము నిరసించు
సముదీర్ణవిపులవక్షమ్ము వాని
దర్పితరాకాసుధాకరశ్రీ నోర్చు
భాసురవదనబింబమ్ము వాని

తే. హారకుండల మకుటకేయూర కౌస్తు
భాంగుళీయక కాంచికాద్యతులరత్న
భూషణోజ్జ్వలవిగ్రహు బుధమనోని
షేవితుని రంగవిభుని గాంచితి లతాంగి! 35

చం. సదమలభక్తిచే నతని సారసతుల్యపదద్వయంబు ఫా
లము గదియంగ మ్రొక్కి మఱలన్ గనుదోయికిఁ దత్సముగ్రతే
జము మిఱుమిట్లుగొల్ప భయసంభ్రమముల్ మదినగ్గలించి తా
లిమి చెడి మ్రొక్కుతీవఁ గదలింపుచు మోమఱవాంచి నిల్చితిన్. 36

ఆ. వె. నాదుభావ మెఱిఁగి నారాయణుఁడు చిఱు
నగవు మిగులఁబల్కె మగువ యిచటి
కేమిదలఁచి వచ్చి తెవ్వరుబనిచిరి
వెఱవనేల దెల్పవే మృగాక్షి! 37

వ. అనిపల్కు నమ్మహాత్ముని సంభాషణమ్ముల వలన ధైర్యం బవలం
బించి కరంబులుముకుళించి యిట్లని విన్నవించితి. 38

ఆ. వె. హరి జగన్నివాస హాటకవసన ర
మావిహార నాదుమనవి యొకటి
కలదు చిత్తగింపవలయు నీదగు దయా
మృతవిలోకనములు మెండుకొనఁగ. 39

సీ. సర్వసర్వంసహాచక్ర నిర్వహణాక్రి
యా సముద్యత నిజోద్యద్భుజుండు
దీపితకీర్తికన్యా పదన్యాస చి
హ్నాన్వితి నిఖలదిగంతరుండు
చటులకోదండ లస్తకవినిర్గత శరా
సార మోహిత శత్రుసముదయుండు
సతతానుగత భాగవతబృంద వందనా
చార సత్కారనిష్ఠాఘనుండు

తే. గీ. రమ్యవేదాంత గుంఫితార్థప్రపంచ
పరిచయావాప్త విజ్ఞాన పరిణతుండు
సకలజన పాలనోత్సాహశక్తి ధరుఁడు
వెలసెఁ గులశేఖరాహ్వయోర్వీవిభుండు. 40

ఉ. ఆమహనీయ తేజునకు నద్భుతశీలగుణప్రసిద్ధయై
శ్రీమహిళాసిభద్యుతులఁ జెల్వముగాంచి జనించెఁ బుత్రి సు
త్రామపదమ్మునందు వసుధాస్థలి రాజగృహమ్ములందు క
న్యామణు లెందఱేని సరియౌదురె! కేరళరాజకన్యకున్. 41

కం. అసమశర కుసుమవిశిఖు
ల్లసము నోడించుసుతను లావణ్యశ్రీ
నెసఁగు చెలికి నీళాహ్వయ
మసదృశవిభవమున నొసఁగె నవనీపతియున్. 42

కం. సిరిమించు లక్షణమ్ముల
సురుచిర లావణ్యశీలసుగుణశ్రేణిన్
సరవిఁ జెనుపొంది యున్నెడ
సరసవయోరేఖ దనరె సరసిజముఖికిన్. 43

చం. జనకుని సన్నిధానమున సమ్యగుపాగత వైష్ణవాస్యసం
జనిత భవద్గుణామృతము సారెకు వీనులఁ గ్రోలుచున్న య
య్యనుపమగాత్రి నిన్ను హృదయమ్మున నాథునిగా భజింపుచున్
ఘనవిరహాగ్ని తాపమునఁ గ్రాగుచునున్నది రంగవల్లభా! 44

వ. ఇత్తెఱంగున మదనశరపీడితయగు నన్నేలంత నిరంతరచింతా సంతాపితస్వాంతయై భవత్సన్నిధానంబున నిజవృత్తాంతం బెఱింగించి ప్రార్థించుటకు నన్నుం బనిచిన నే తెంచితి నన్నేలంత ప్రాణపరిత్యాగప్రాణరక్షణమ్ములు రెండును భవత్కరకమలగతంబులై యున్నయవి భక్తవత్సల! దేవర దివ్యచిత్తమ్మునకుం దోఁచినయట్లు చేయుండని మ్రొక్కి నిలిచిన నమ్మహాత్ముండు వికసితముఖుండై నన్నుంజూచి. 45

కం. మున్ను బుధు లెన్న సిన్నియు
విన్నాఁడఁ దదీయవిరహవేదనచే ని
ట్లున్నాఁడ నింక నే న
కన్నియఁ గైకొనక తాళఁగలనా! లలనా! 46

తే. గీ. అతివ! నేన వత్తు నచటికిఁ గులశేఖ
రావనీశుఁ గాంచి యాదరించి
యతనిపుత్రిఁ బెండ్లియాడెద నింక నేఁ
జెప్ప నేల నను చెలియకడకు. 47

వ. అని యానతిచ్చి నిజనఖరముఖలిఖితంబగు శ్రీముఖంబు నీవు నిమ్మని యొసంగె మఱియును మధుకరనికరసుకరమ్ములగు నెత్తావివిరిదండలు నాకుం గృపసేసి బహూకరించె పదంపడి భవద్విరహక్రాంతి శాంతిం బొందించుమని యమ్మహాత్ముం డాజ్ఞాపించినం జనుదెంచితినని పల్కి మఱియు నిట్లనియె. 48

ఉ. ఓ సుకుమారగాత్రి! సుగుణోజ్జ్వలకీర్తి! నృపాలపుత్రి! యు
ల్లాస మెసంగ రంగపతిలాలితలైన లతాంగు లెవ్వరున్
నీ సరి రారటంచు మది నిశ్చయమేర్పడఁ బల్కె నింక నీ
చేసిన పుణ్యరాశి ఫలసిద్ధి వహించెఁగదమ్మ! నేఁటికిన్. 49

వ. అనిపల్కి రంగవల్లభుండిచ్చిన శ్రీముఖపత్రంబు నీళాంగనకుఁ గొసంగిన నయ్యింతి నిజసఖులుం దానును పత్రికాలిఖితవృత్తమ్ము చదివించి గంటు. 50

శా. శ్రీలాలిత్యవిశాల రంగనగరిం జెల్వొందు గోవిందుఁడన్
శాలారత్నము! చింత యేమిటికి, సంభావించి శక్రాది ది

శ్వాలుల్ మెచ్చఁ బరిగ్రహింతు నిను సౌఖ్యంబేర్పడన్ భృంగలీ
లాలోలాలకలాంఛితాలిక ! నిసిశాశావధూమాధూమణీ. 51

వ. అనుచుం జదువునప్పుడు నామాక్షరవ్యత్యయమ్మునకు విశంకించు సమయమ్మున నెచ్చెలు లిట్లనిరి. 52

చం. మగువ విచారమేల ! వనమాలి మనోభవబాధితాంగుఁడై
పొగయుచు వృత్తిలేఖ నొకచొప్పున వ్రాయుచునుండి యంత నీ
దగునభిధానవర్ణము లుదంచితలీల లిఖించుచోటఁ బె
ల్లెగసిన మోహాసంతమ మిట్లు రచింపఁగఁ జేసెఁ గోమలీ ! 53

వ. అని ప్రౌఢకాంతలుపన్యసింప వారల తదర్థానబోధనంబునకు సంతసిల్లి రాజకన్యక వికసితముఖకమలయై నీలవేణిం జూచి. 54

సీ. పద్మసంభవముఖ ప్రార్థనీయపదుండు
నిలిచి మాటాడెనె నీలవేణి !
సకలవేదాంత సంచారస్వభావాఢ్యు
నెలవు జేరితివటే ! నీలవేణి
శతమఖప్రముఖ పూజితపదాంభోజుండు
నిను సత్కరించెనే ! నీలవేణి
కవిబృహస్పతి కృతస్తవ భవ్యచరితుండు
నీనుతుల్ మెచ్చెనే ! నీలవేణి

తే. గీ. నాగశయనుని దర్శించి నాదుమనవి
వితతముగ విన్నవించి సమ్మతునిఁ జేసి
యెలమిఁ దళుకొత్త ననునిర్వహించి తీవు
నీదు ఋణమెట్లు దీర్తునే నీలవేణి ! 55

వ. అని పొగడుచు నయ్యింతిం గాఁగిలించికొని సంతోషమ్మునం బొదలుచున్నయెడనఖిజను లారాజకన్యం గనుఁగొని. 56

సీ. మసలఁ జూచుచు నీపమున ద్రావాలెఁ గేకల
సడలఁజేయక యున్న యది శిఖండి
ససల రోయుచుఁ బరాకున నున్నఁ గూయదే
కాకి పెంచిన కెంపుగంటి పులుగు
నొకచోటఁ గాలునిల్వక లతాంగుల నేఁచఁ
బూని క్రుమ్మెలు సోకుబూత మదియె
యెక్కడెక్కడి చాయ ప్రక్కలు మైనిండి
నిక్కుచుండెడుఁ బద్మినీవిరోధి

తే. గీ. మరుని గాదిలిచుట్టముల్ మనకుహితులె
విరహిణుల నేఁతు రిచ్చోట విరులతోట
వెడలి నీదగు మహనీయ వివిధరత్న
చిత్రకాంచన సౌధముఁ జేరవలయు.

వ. అనుచు సమ్రాజ్ఞిని మేననుండెడు సుమనోరజమ్ము కరమ్ములం బుడిచి శీతలసలిలమ్ముల ముఖమ్ము గడిగి తిలకమ్ము దీర్చి కరమ్ము బట్టి లెమ్ము లెమ్మనుచు లతాంగులు నీలాంగనం బొదివికొని చరణశింజానవమ్ము పిక్కటిల్ల హంససందోహమ్ము నడచు కరిణి మందగతిం జని మహనీయ సౌధాంతరమ్ము సొచ్చి యుచితగతి నివసించియుండిరంత. 58

## మంత్రుల దుర్మంత్రము

ఉ. శీలగుణోజ్జ్వలుండు కులశేఖరభూవరుఁ డాత్మమంత్రి వా
గ్జాల మనిత్యలౌకికవిచారవిఫలం బది యేల నంచు ల
క్ష్మీలలనామనోహరు విశిష్టకథాశ్రవణమ్ము మోక్షదం
బై లలినొప్పు నట్టిది మహాత్ములసన్నిధిఁ గాని కల్గునే! 59

వ. ఇవ్విధంబున మనంబునం దలంచి శ్రీవైష్ణవసన్నిధానంబున నిరంతరంబును యోగ్యకాలక్షేపమ్ము సలుపుచుండె. నయ్యవసరమ్మున నిజప్రభుప్రియసంభాషణాభావజనితక్రోధమ్ముచే మంత్రియూథమ్ము దమలోన. 60

కం. శ్రీవైష్ణవు లిత్తఱిఁ దన
భూవరునిం బొదివికొని బుధప్రవరులకుం

గ్రోవయిడె రధిపుఁ జూడం
గా వశమే! మనకు రాజకార్యప్రౌఢిన్. 61

కవిరాజ. అనుపమ సహామాత్యు లుపాంశువిచార సమన్వితోద్యమయుక్తినుతై
ఘనులకు రాజునకుం గలవైక్యము గాసియొనర్చు నుపాయముచే
మనముల నొక్కొకరీతిఁ దలంచి సమగ్రజలాశయనక్రగతిన్
దినదినమున్ దగుకాలము వేచుచుఁ బ్రిమ్మరుచుండిరి దుర్మతులై. 62

మ. ఒకనాఁ డానృపహర్మ్య యోగ్యసమయం బూహించి యభ్యంగ
క్రమకళాకోవిదు జెట్టి నొక్కరుని నేరావించి మాణిక్యచి
త్రకిరీటాంగదకుండలద్వయ వినూత్నస్ఫారహారావళుల్
ప్రకటాప్తిమయ మనోజ్ఞపీఠతటి యోరం బెట్టి తా నొక్కెడన్. 63

వ. అంత మల్లకరతలోల్లసితసంవాహనసుఖపరవశుండై యుండు నంత.

కం. సందుగని సచివులధిపుని
పొందుగఁ బిరముఁ నిడినభూషణములు నే
గం దిగిచిడాఁప లంచం
బందిన యొకబోటిఁ బనిచి రతిసాహసులై 65

కం. పనిచినఁ బిరిక సనిచిన
ఘనరత్నవిభూషణములు గైకొని జరరాం
గన యొకమఱుఁగున డాఁచెన్
దనదుర్వినయప్రపంచదశ నింద్యముగన్. 66

మ. నరనాథాగ్రణియున్ బవిత్రసలిలస్నానమ్ము గావించి భా
సురపట్టాంబరధారియై బుధజనస్తోతవ్య దివ్యస్థలా
కరజ శ్వేతమృద్ధూర్ధ్వ పుండ్రరచనాక్రమానసాంభోజుఁడై
తిరుమంత్రంబు జపించి చెంత నొకయింతిం జూచి పల్కెన్ వెసన్. 67

తే. గీ. నాతి తడవయ్యె మద్భూషణములు పీఠ
తలమునందిడి వచ్చితి మలయ కిపుడ
పొమ్ము తెమ్మంచుఁ బలికిన భూవరేణ్యు
నాజ్ఞ వేవేగ నట కేగి యంబుజాక్షి 68

కం. చని యచట వెదకి సొమ్ములు
కనిపింపకయున్న రాజుకడ కేగి మనం
బున వెఱఁగుదోఁప నంతయు
వినిపించిన నవ్విభుండు విస్మితుఁ డగుచున్. 69

చం. నరవరుఁ డాత్మపీఠమున నవ్యవిభూషణపంక్తి లేమిఁ దా
నరసి సమీపవర్తులగు నాప్తుల నెల్లెడఁ జూడఁ బంచి యే
సరణియుఁ దోఁపకుండుటయుఁ జయ్యన మంత్రిగణమ్ము గూర్చి యం
దఱు విననిట్లు బల్కె మదిఁ దద్దయు నస్వస్థత మగ్గలింపఁగన్. 70

ఉ. మంజులపీఠమధ్యమున మన్మణిభూషణపంక్తిఁ బెట్టి య
భ్యంజనతత్పరుండనగునప్పుడు దాని హరించె నెవ్వఁడో
కుంజగుహాంతరమ్ముల నిగూఢము చేయునొ వానిఁ దెచ్చి యీ
నెంజిలిఁ బాయఁ జేయుటకు నేర్పరులయ్య మీరలే కదా ! 71

వ. అనిన నమాత్యులిట్లనిరి. 72

మ. మనుజాధీశ్వర ! దూఱనేమిటికి దుర్మంత్రప్రచారాన్వితుల్
ఘనులో హీనులొ నిశ్చయించి పలుకంగావచ్చునే ! మాకుఁ గాం
చనవాంఛాకృత వంచనామిళిత సౌజన్యమ్ము వాటింతురిం
తననేలా పరికించినన్ దెలియరాదా ! నీదుచిత్తమ్మునన్. 73

కం. అనిసచివులు భాషింపన్
విని భూరమణుండు కినుక నెఱసిన చిత్త
మ్మునఁ బల్కె నచటఁ గంటిమి
ఘనులకుఁ జౌర్యాభిలాష గడలుకొనంగన్. 74

ఉ. నావుడు వారలా మనుజనాథునితో మదిఁ గోపగించి సన్
బ్రోవునె నిశ్చయించితిమి మున్నిటువంటివి పుట్టునందు నే
తావుఁ గన్న వైష్ణవకదంబము ద్రొక్కనిచోటు లేదు రా
జావసథమ్ము నందెచటనైన వినంబడ విట్టిచోద్యముల్. 75

ఉ. నాఁడు మనయ్యగాంద్రుఁ గిరినస్థితి నెండలనీవరించినన్
వాఁడిరటంచుఁ గోపమున వాఁకిటికావలివారిఁ జెంపబిం

శాసిగ నాగ్రహించి చెనవమ్మెయినిచ్చిన నోట నవ్వరే
జాసిలవారలెఱుఁగో తెలియనేర్వమా ! మాకు గదా మహేశ్వరా ! 76

ఆ. వె. అనినఁ జెవులు మూసికొని పాపరతుల గా
న్పచన చన విసఁగవలసె ననుచు
జనవరేణ్యుఁ డప్పుడు సంతప్తచిత్తుఁడై
కనరుఁగోప మంత్రిజనులఁ జూచి. 77

ఉ. అక్కట శాంతచిత్తులు మహాత్ములు భాగవతోత్తముల్ మఱిన్
స్రుక్కక వారు రోగులనుచున్ గద యిట్లు వచింతు రోరి మీ
కెక్కడి సత్యశౌచకథ యెక్కడి ధర్మవిచారనిష్ఠ వం
బెక్కునధర్మదంబొకటి హీనవిచారులఁ జేయకుందు నే ! 78

చం. జలరుహపత్రలోచనుఁడు సర్వజగత్పతి వైష్ణవోత్తముల్
దలఁపఁ దదీయపుత్రులుగదా ! ధరఁగల్గుధనమ్ము లెల్ల వా
రలవిని గైకొనందగుదు రట్టిదెఱింగి యికేల పెక్కు భా
షలు భగవత్ప్రపన్నులకుఁ గార్యము లేదని పాపు ముట్టుదన్. 79

కం. అని తెంపునఁ బలికెడి య
జ్ఞపతి వచనములకులికి సచివులు నృప ! నీ
కనుచితము బాస ధరఁ గాం
చనవాంఛఁ బొసంగు నెట్టిజనులకు నైనన్. 80

కం. ఏమేమీ ! మీగుణములు
స్వాములపై ద్రోచి పలుకఁ జనునే ! దుశ్చిం
తామలినస్వాంతులు ల
క్ష్మీశమహిమను చెంతఁ జేరంగలరే ! 81

వ. అనిపల్కి భాగవతపరిభవభాషణశ్రవణజనితరోషకషాయితమ్ము లగు కనుంగొనల నిప్పులుప్పతిల్ల వారలముఖభంగంబును భగవత్ప్రపన్నప్రభావప్రకటనంబును జేయందలంచి దంష్ట్రనొక యహితుండికునిం బిలిచి నీలవర్ణాభీలంబైన వ్యాళంబు నొక్కటి గొని తెండని పనిచిన వారు సత్వరంబ కృతాంతాకారఘోరంబైన భుజంగమ్ముఁ బట్టి తెచ్చిన నిజాంఘ్రిలీయకంబుతోడ దానినొక్కనూతనభాండమ్ము

పందుఁ బెట్టించి తాను నిశ్శంకుండై దానిం బట్టికొన నుద్యోగించునప్పుడు సురగరుడ గంధర్వకిన్నర కింపురుషసిద్ధసాధ్యాదు లాకాశమ్ము నిరవకాశమ్ముగా నిలిచి విస్మయంబునం జూచుచుండిరి హితాపహిత మంత్రిసామంతవర్గం బిదియేమి పనియని యిమ్మహారాజునకు దోఁచెననువారును నెవ్వరికినిమ్మ లెవ్వరెఱుంగుదు రిట్టిసాహసమ్మునకుం గొత్తిరేయను వారును నయ్యెడ నెంతయు సమ్మోహాక్రాంతులైరి. 82

స్వాములకు దోషము లేమికి గులశేఖరుఁడు పాము ముట్టుట

తే. గీ. చూడు మెల్లవారు శుద్ధాంతరంగులు
భాగవతులు వారిపట్లఁ గలుష
వృత్తి లేదటంచు నెసఁగ గేలఁదడ నెద
సర్ప మూఱకునికి సాక్షి మీరు. ౮౩

వ. అనిపలికి దయాసముద్రుండగు రామభద్రుం దలంచుచు 84

కం. చండాశీవిష భీషణ
భాండమ్మునఁ గేలుసొనిపి భయవిరహితుఁడై
యుండిన మండలపతిఁ గని
గుండియ లిట్టట్టుచెదరెఁ గొంకొని ప్రజకున్. 85

కం. తృణరజ్జులీల వంచిన
ఫణముత్తికయున్న ఘోరఫణి గాంచి నృపా
గ్రణి యొక్కకడకుఁ ద్రోఁచుచు
మణిముద్రిక డిగిచిచూపె మనుజులకెల్లన్. 86

మ. సురగంధర్వవిహంగపుంగవులు యక్షుల్ సిద్ధవిద్యాధరుల్
ధరణీవల్లభు సత్యధర్మముల కాత్మన్ విస్మయోల్లాస ని
ర్భరులై యంతనిమీఁద దివ్యకుసుమవ్రాతమ్ము వర్షించి ర
చ్చరలోకుల్ నటనావిశేష లలితోత్సాహమ్ము వాటింపఁగన్. 87

ఉ. అప్పుడు మంత్రులెంతయు భయంబడి మేరువు సంచలింప మా
తప్పు క్షమింపుమంచు వసుధావరు పాదములందు వ్రాలినన్
జొప్పడు శాంతిచే బలికె స్రుక్కి నెతంబడ నేల! స్వాములం
దెప్పుడు భక్తియుక్తిఁ జరియింపుడు మత్కృతి మెల్లఁ బాయఁగన్. 88

వ. భూసురసారంబుతో పౌరజనంబుల సాధువాదంబు బేరయుకలకలంబు దశదిశల నెసంగ నప్పుడు. 89

## శ్రీమన్నారాయణ సాక్షాత్కారము

సీ. మురువుదీపించు నెమ్మోము జాబిల్లిపై
చిఱునవ్వు వెన్నెల చెలువుఁజూప
జిగిదళుకొత్తు వాసించుపొక్కిటితమ్మి
బొమ్మవేలుపు జన్మభూమిఁ దెలుప
నఱమునఁ గాంచీగుణవ్యాప్తి బొడ్డులో
గలజగమ్ములకుఁ బైకాఁపుఁబూన
పొలుచు వక్షోహారముల చందిరఁపుఁగావి
కమలాకుచక్గాని గణనసేయు

తే. గీ. మంజుశింజాతి కింజల్కపుంజ రుచిర
పీతకౌశేయరుచులు పైఁబెరయ విహగ
రాజతురగమ్ము నెక్కి శ్రీరంగరమణుఁ
డెమ్మెహావల్లభునకుఁ బ్రత్యక్షమయ్యె. 90

ఉ. మించులమించు వస్త్రరుచి మీఱఁగ భూషణరత్నదీధితుల్
మించిపొసంగ నిన్నిటిసిమించి మురాంతకుదివ్యతేజమున్
గాంచుటకుం దలంకెడుమనంబు నోకించుక నిల్వరించి సే
వించె నృపాలమౌళి యరవిందదళాక్షునిపాదసన్నిధిన్. 91

తే. గీ. ఇట్లు ప్రణమిల్లి యతఁడు లక్ష్మీశు నెదుట
నిటలతటమున నంజలిపుటముఁ జేర్చి
సమ్మదాశ్రులు కన్నులఁ గ్రమ్మ దేఱ
సవినయమ్ముగ నిట్లని సన్నుతించె. 92

చం. సరసిజగర్భశంకరశక్రశానుశతక్రతు ముఖ్యసేవ్య! భా
సురమహిమాలవాల! పరిశోభితభూరియశోవిశాల! దు
ష్కరదనుజవ్రజోగ్ర బలఖండనపండితకాండజాల! సు
స్థిరనిగమాంతసంచరణశీల! సుధీజనపాలనప్రియా! 93

దండకము. శ్రీమత్సుధాంభోధి వీచీచలచ్ఛేషభోగీంద్రపర్యంకశాయీ! ప్రపంచో దయాదిక్రియాసంవిధాయీ! సధర్మానుయాయీ! బుధానందదాయీ! జగజ్జీవనాధారసమ్యగ్విచారా! ధరాభారసంహారకార్యావతారా! జితారాతిశూరా! మహోదారలక్ష్మీవిహారా! గభీరోరుసంసారఘోరాంబురాశిం బ్రవేశించి నిమ్మగ్నులై తీరమున్ జేరఁగా జాలరజ్ఞుల్ కడుం బ్రాజ్ఞులాత్మన్ భవద్విగ్రహధ్యానయోగంబు పెన్నావగాఁ జెంది నిశ్శంకబుద్ధిన్ విజృంభింతు రానందసంధానసద్మంబులై నట్టి మీపాదపద్మంబు లెల్లప్పుడున్ గొల్చువారెంతవారో కదా! త్వత్ప్రభావమ్ము భావింప నే నెంతవాఁడన్ మహత్తత్త్వసంభూతభూతాద్యహంకార సంజాతశబ్దాది తన్మాత్రజాభాసిలాగ్నిక్షమాఖ్యప్రసిద్ధంబులౌ పంచభూతంబు లన్యోన్యయోగంబునం జేసి కాదే ప్రపంచంబనేకాకృతుల్ దాల్చి చూపట్టు నో యయ్య నీ వెయ్యెడన్ సూక్ష్మరూపంబునం జొచ్చి వర్తింతు వీవే కదా! మున్ను కల్పాంతవేళన్ మహాల్లోలకల్లోలవీచీసముద్యత్పయోరాశి మధ్యంబునన్ దివ్యతేజోనుకారీ! నమో! మీనమై వారిధిం జొచ్చి దైత్యాధముం ద్రుంచి వేదమ్ములా వేధ కర్పింపవే! ...ప్పెంబై భారంబునన్ మందరక్ష్మాధరం బబ్ధిం గవ్వముం జేసి దేవాసురుల్ ద్రచ్చుచో గ్రావ మంభోధిఁ గ్రుంగన్ విలోకించి కారుణ్యదృష్టిన్ మహోర్మిచ్ఛటల్ జర్ఝరీభూతముల్ గాఁ బడిం గూర్మమై వచ్చి యక్కొండకుం ద్రిండుగా దండిగా నిల్చి చంచత్సుధాకుంభసంభూతి గావించి బర్హిర్ముఖశ్రేణులన్ బ్రోవవే! దుర్జయుండై హిరణ్యాక్షుఁ డుర్వీతలంబంతయుం జాపచుట్టంగ నీక్షించి బ్రహ్మాదులత్యంతభీతిన్ వితర్కించువారో మహోదార! భూదారరూపంబునన్ దైత్యువక్షమ్ము భేదించి నిష్ప్రాణునిం జేసి లోకమ్ములం గావవే! యింకఁ దత్పూర్వజుండైన దుష్టాసురేంద్రుండు సమ్యగ్గుణాధారు గోవిందపాదాబ్జచింతావిహారుం గుమారున్ నిరోధించి నాతో విరోధించెదే దుర్మతీ! యివ్విరించిప్రపంచమ్మునం దెవ్వఁడైనన్ మదీయాజ్ఞ కున్మించి వర్తించునే! విష్ణుఁ డెందెందు శోధించినం దోఁచు నంచీవు శోషించెదవైన నేతత్సభాస్తంభమధ్యంబునం జూపుమంచు న్నుగ్రబాహాగ్రసంఘట్టనధ్వాన నిర్భిన్నదిగ్దంతికర్ణద్వయీగోళముల్గా సభాస్తంభమున్ వ్రేయ సందద్భుతాకారఘోరమ్ముగా నుద్భవంబై నృసింహాకృతిం బెంపువాటించి దైత్యేంద్రుని న్నింటిపై నొంటిపై నంటి రానీని వేగంబునం బాఱుచో వానిఁ బోనీక యుష్మద్భుజాదండసంఘట్టి

తుం జేయుచుం దెచ్చి రాజత్సభాద్వారదేశంబునం దూరుదేశంబునం
బేర్చి దంభోళిధారాధికారంబు నందందనిందించు చంచన్నఖాగ్రంబులం
దున్నితూటాడి తత్పుత్రు నత్యంతసౌభాగ్యసంపన్నునిం జేసి రక్షింపవే !
తొల్లి యింద్రుం బలీంద్రుండు చండప్రతాపానలజ్వాలలం గ్రమ్మి
నాకాదిలోకమ్ములన్ నిర్జరానీక ఘోరాటవిం జెందగాఁ జేయుచున్
బూజ్యమైనట్టి స్వర్లోకరాజ్యమ్ము తాఁ జేయ దోఁ గశ్యపప్రార్థనావాక్య
సంతుష్టచిత్తుండవై వామనాకారమేపారి యజ్ఞార్థి మద్దానవుం జేరి
నాకుం బదస్థానమ్ము గావించు మూఁడడ్గులంచుం బ్రసంగించి
మైకొన్న దోఁ బాదముల్ పెంచి బ్రహ్మాండగోళంబు పాదద్వయిం గొల్చి
దైత్యేంద్రునోడించి స్వారాజ్య మింద్రాదిబృందారకుల్ మెచ్చఁగానిచ్చి
పోషించవే! యింకమున్నార్తవీర్యాత్మజుండాదిక్షమాభర్త లత్యంతగర్వోద్ధతిన్
ధర్మవిధ్వంసమున్ జేయఁ గోపించి నీవయ్యెడన్ జామదగ్న్యుండవై పుట్టి
పాపక్రియాపాజ్ఞునుండైన యయ్యర్జునుం దాఁకి తద్బాహుసాహస్రముల్
తత్కిరీటోజ్జ్వలంబైన శీర్షంబుతోడన్ కుఠారోగ్రధారాహతిం ద్రుంచి
గర్వాంధరాజన్యవిధ్వంసమున్ జేసి భూభారమున్ మాన్పవే మున్ను
లోకైకసంరక్షణం బాచరింపన్ బితృవాదిసంప్రాప్తరాజాదిధాత్రీస్థలిం
గోసలేంద్రాగ్రనారాత్మజస్నిగ్ధసంభూతి వాటించి శ్రీరామనామంబునన్
బూర్ణచంద్రాకృతిన్ బ్రాపుదీపించి ఘోరాధ్వవిధ్వస్త నానాపురగ్రామ
శృంగాటకం దాటకన్ ద్రుంచి సంగ్రామకేళీత్వరుల్ నత్యుగ్రదేహున్
సుబాహున్ ధరన్ గూల్చి మారీచు నంభోధివీచీనిమగ్నాంగుఁ గావించి
మౌనీంద్రుయాగమ్ము సౌభాగ్యయోగమ్ముగాఁ గావించి వేడ్క కృపాదోటన్
మునీంద్రోగ్రశాపమ్మునన్ గ్రావరూపమ్మునన్ గాసినొందన్ యయున్న
యహల్యాఖ్యదేవిన్ గృపాదృష్టి నీక్షించి నీపాదపద్మద్వయీపాంసులేశమ్ము
నన్ రోషనిర్ముక్తఁ జేసి తొంటిరూపమ్మునం జెంది తద్భర్తృసంభోగ
సౌఖ్యమ్ము నొందింపవే! యంకరోదగ్రకోదండదండమ్ము ఖండమ్ముగా నుగ్గు
గావించి లోకైకవిఖ్యాతలక్ష్మీకళాజాతయౌ సీతఁ బెండ్లాడి త్రోవన్ను
రోధించినన్ భార్గవుం దోలి నాకేతముం జేరి నీసంతతమాత్రాంతరద్వేష
యోగంబునన్ రాజ్యసౌఖ్యాభిలాషమ్ము చాలించి సమ్యగ్గుణోపేతుఁడై
యొప్పు సీతామహాదేవియున్ బ్రసుదీపింప సౌమిత్రియుం గొల్వఁగాఁ
దాపసాకారమేపారఁ గాంతారసీమన్ విరాధున్ ఖరున్ దూషణాద్యుగ్ర
దైతేయులం ద్రుంపవే! రావణుండంత దుస్తంత్రుఁడై ధారుణీకన్యఁ

గొంపోయి లంకాపురారామసీమన్ జెఱన్ బెట్టుటన్ నీవు సుగ్రీవసాం
గత్యమింపొందఁగావించి యొక్కమ్మునన్ వాలిఁ దూలించి సుగ్రీవు
రాజ్యాభిషేకోజ్జ్వలుంజేసి తత్సంగతిన్ వార్ధిబంధించి వేగన్ హనూ
మత్ప్రభృత్యుగ్రశాఖామృగశ్రేణితో లంకభేదించి ధూమ్రాక్షకుం
భేంద్రజిన్ముఖ్యులం జంపి యక్కుంభకర్ణున్ ధరన్ గూల్చి దైత్యేశ్వర
ప్రాణవిధ్వంసమున్ జేసి నీదాసునిన్ గుంభకర్ణానుజుం బ్రోచి బ్రహ్మేంద్ర
ముఖ్యుల్ భజింపంగ సీతాసమేతుండవై జాంబవద్భానుపుత్రాంజనే
యాంగదాదుల్ వెసంగొల్వ రత్నప్రభావిస్ఫురత్పుష్పకారూఢి నేతెంచి
మార్తండవంశావనీశప్రియంబౌన యోధ్యాపురంబున్ బ్రవేశించి గంధర్వ
గానంబు రంభాదినాట్యప్రసంగంబులున్ శౌనకాదిత్యకణ్వాది మౌని
వ్రజంబున్ సునాసీరముఖ్యామరశ్రేణియున్ భూరిభేరీమృదంగాది ఘో
షములుం బర్వఁ బర్వేందుబింబంబు చందంబునం గాంతి పెంపొందఁ బట్టాభి
షిక్తుండవై లోకసంరక్షణోపాయమే పారశోభిల్లవే! యింకనుం దేవకీదేవి
గర్భంబునం బుట్టి పెంపేర్పడన్ రామకృష్ణాభిధానంబులన్ బెంపువాటించి
వ్రేపల్లెలో వల్లవుల్ మెచ్చఁ గ్రీడించుచున్ వెన్నలుం బాలు చౌర్యం
బునం గ్రోలుచో గుంపులై గోపికల్ రంతు సేయన్ బ్రమోదింపవే!
పూతనాఖ్యన్ దృణావర్తునిన్ వత్సదైత్యున్ బకాఖ్యాసురాభిఖ్యులన్
ద్రుంచి గోగోపకవ్రాతమున్ బ్రోవవే! కాళియాహిన్ మదంబేఁక పాదం
బులం ద్రొక్కి త్రొక్కింపవే! వజ్రికోపించుటన్ ఘోరపాషాణవాతాంబు
పాతంబులన్ గోకులంబాకులంబందఁగాఁ జేయు మేఘవ్రజంబుల్ విలోకించి
గోగోపగోపీజనంబుల్ ప్రమోదింప గోవర్ధనోర్వీధరం బెత్తి హస్తాగ్ర
పీఠమ్మునన్ నిల్పి ఛత్రమ్ముగాఁ బట్టి యాభీరులన్ బ్రోవవే! గోపికల్
నీవయిన్ మోహవిభ్రాంతిచేఁ జేరి ప్రార్థింపఁ గద్వాంఛలీడేర్పవే! ధర్మ
విధ్వంసునిం గంసుహింసించి మోదంబునన్ దల్లిదండ్రుల్ హితుల్ బంధు
సందోహముల్ సంతసింపంగ వర్తింపవే! కీర్తి మూర్తీభవింపన్ ద్విజ
శ్రేణులన్ బ్రోవవే! మాగధాదిద్విషత్కోటి నిర్జించి శ్రీరుక్మిణీకన్యకం
దెచ్చి పత్నీవతంసంబుగాఁ జేయవే! పాండుపుత్ర ప్రియాకాంక్షివై దుష్ట
చారిత్రు దుర్యోధనుం గూల్పవే చక్రపాణీ! జగన్నాథ! నిన్నున్ భజింపంగ
శక్తుండనే రాక్షసవ్రాతనిర్యాతనేచ్ఛన్ దయాంగనాసద్వ్రతధ్వంస
ముంజేయ బుద్ధావతారంబవై కొంటివింకన్ గలివ్యాకులంబైన కాలంబు
నన్ దుర్మదోదగ్రమై మ్లేచ్ఛవర్గంబు దోర్గర్వదుర్వారవృత్తిన్ విజృం

భించి ధర్మక్రియానాశముం జేసి విప్రాదిక ప్రాణిలోకప్రమాదావహంబైన
యత్నంబునన్ మించి బాధించినన్ గాంచి కోపించి నీవయ్యెడన్ గల్కివై
కాదె రంగత్తురంగాధిరూఢుండవై బాహుదండస్ఫురన్మండలాగ్రంబునం
దుష్టులం బట్టి ఖండించి సన్మార్గముల్ వెంచి లోకంబశోకంబుగాఁ జేసి రక్షిం
పవే! వృష్టిచేఁ దుష్టిగావించి సస్యాభివృద్ధిన్ బ్రజన్ బ్రోవవే! గ్రాహ
సంగ్రస్తమై హస్తిరాజమ్ము ఘోషింపఁగారుణ్యమే పార నేతెంచి రక్షిం
పవే! కర్మవిజ్ఞానభక్తిప్రపత్త్యాదులం బెద్దియుం జేయఁగాఁజాల నీపాద
పద్మద్వయంబున్ శరణ్యమ్ముగా నమ్మితిన్ నన్ను రక్షింపవే! భక్తమం
దార! సర్వప్రజాధార! లక్ష్మీవిహారా! నమస్తే నమస్తే నమః. 94

చం. అనుచు నుతించుచున్న వసుధాధిపతిన్ గరుణామృతమ్ముచే
నెనసినచూడ్కిఁ జూచుచు రమేశ్వరుఁ డాతని మేను పల్లవం
బన మృదులీలనొప్ప నిజహస్తతలంబున నంటుచున్ గుణా
వనపోఁడవీవు నీకు సరివత్తురె! దివ్యులు భక్తియుక్తికిన్. 95

తే. మెచ్చువచ్చితి వేఁడుము నిచ్చఁ గోర్కు
వాంఛ దీర్చెద నరవర! వినుము నేను
మనినఁ గులశేఖరుఁడు వినయమునఁ బలికె
స్వామి! నీపాదభక్తియే చాలుననుచు. 96

చం. సురనరనాగలోకముల శోభిలుకన్యకలందు నిందుమో
వ్వారు సరిరారు రూపగుణవైభవలీలల సింధుతనూజ కీ
డ్డరనని లోకులెన్నఁగ నుదారగుణాకర! నాదుకన్యకన్
దీనముగ నీకు నీఁదలఁచితిన్ గెలిఁ బెండిలిగమ్ము నెమ్మితోన్. 97

క. వరమిది యొసఁగుమనిన నవ్వుచు
హరి యిట్లను నో నృపాగ్రణి! లక్ష్మీ శ్రీ
ధరణీనీళాఖ్యలు ము
వ్వురు మత్సతులనుచు నెఱుఁగవో! వేదముల్. 98

తే. ఇపుడు నను రంగమందుఁ గుఱికొని కోర్కి
ముదివాసమి నీదుపుత్రియై యుదయమందె

విను మెనరపాల ! యే నంతకంటె మున్నె
కోరియున్నాఁడ నయ్యంతిఁ గూడుటకును. 99

వ. అని యభిప్రాయంబు దెలింగించిన. 100

కం. రాజు ప్రియమునంది యో ఖగ
రాజతురంగానుషంగ రంగపతీ ! మా
రాజీవేక్షణఁ బెండిలి
గాఁ జేయ ననుగ్రహింపవ గావలయుఁ గృపన్. 101

వ. అనుడుం బ్రార్థించిన నన్నృపదేవుండు పట్టన కానిండని యనుగ్రహించినఁ గార్తాంతికులం బిల్వఁబంచి యారేయి ముహూర్తనిశ్చయంబుగావించి ముక్తాఫల మాలికాభిరామంబును మరకతమణిప్రభాశోభితస్తంభసంభృతంబును బద్మరాగ శిలాపుంజమంజులసాలభంజికారంజితంబును నగణితమణిగణకిరణభూషితసువర్ణబిందు సుందరకవాటశోభితంబును నగు నొక్క మహాసౌధంబు మహాత్మునకు విడిదలగా నిరూపించి యచ్చటికి విచ్చేయునట్లుగావించి రుచిరాభీష్టపదార్థంబులు సమర్పించి యంతఃపురంబు శృంగారింపుఁడని వారి నియోగించిన. 102

సీ. రచితసామంతాంగరాగిమాటిసకటల్
తెలఁగఁ జేసిరి సభాస్తంభములను
రజమడంగఁగఁ జందనజలంబుఁ జల్లిరి
వీథవీథుల బహిర్వేదికలను
మృగనాభి నలికి కూర్చిరి కప్పురంబున
రంగువల్లికలు గేహాంగణముల
రహిమించు పచ్చతోరణముల నెడ నెడ
వ్రేలఁగట్టిరి కర్కటీఫలముల

తే. గీ. ధూపస్థితెసఁ జల్లు పిష్టాతిధూళి బోరయు
పటికములనారసిరి ? [మఱి] పావడముల
ప్రేమ దళుకొత్త నిలిపిరి నృపతిగృహ వి
టంకతటములఁ జిత్రపటధ్వజములు. 103

కం. సరసాన్నపానముల న
న్నరసనుఁడు సమస్తజనమనఃప్రియముగ భూ
సురసంతర్పణ మత్యా
దరమునఁ గావించె విబుధతతి మెచ్చంగన్. 104

చం. ఫలములు జున్ను ఖజ్జములు పాయసముల్ గలమాన్న మప్పడం
బులు వడ లిడ్డెనల్ సగుడమోదకముల్ మిఱియంపుఁజారు సం
ధిలు ఘృతపూరధారలు తుదిన్ దధిఖండసహాయమేర్పడన్
జెలిమి భుజింపఁబెట్టె నృపసింహుఁడు బంధుహితార్థకోటికిన్. 105

వ. అంత సమ్మోహినీకాంతుండు నిజకన్యాసఖీజాలం బిలిచి యిట్లనియె. 106

కం. మీర లిపుడె చని మా నీ
శారమణికి నుచితమంగళస్నానాలం
కారమ్ములు గావింపుఁడు
నారీమణులార! కడు మనఃప్రియమెసఁగన్. 107

వ. అని యాజ్ఞాపించిన నవ్వేలందులమందగతిం జని యొక్క మణిమాలికాలంకారసురుచిరంబగు మందిరంబునందు సముచితపీఠమ్మునం గూర్చున్నయన్నెలంతం గాంచి డాయంజని యిట్లనిరి. 108

శా. ఏవేళన్ మదిఁగోర్కు వాఘునుఁడు తానే తెంచె మీతండ్రి సం
భావించె న్నినుఁబెండ్లిసేయఁగ శుభాంభఃస్నానసశృంగారముల్
గావింపన్ మముఁబంచినాఁడిచట నాలస్యమ్ముగాసీక లే
లేవమ్మా రుచిరాంగి! నీవిభవ ముల్లేఖింపలేరెవ్వరున్. 109

కం. అనుచు నృపకన్యఁ దోడ్కొని
చని యొకపీఠమున నునిచి జలకేళిం లో
య్యాన సభ్యంగస్నానం
బొనరించిరి పరిమళప్రయుక్తజలములన్. 110

కం. ఒడలు తడియార్చి పొందళు
కెడలని నునువలువఁ గట్టనిచ్చి నెటికురుల్

దడవి ముడియునిచి జిగిచిం
దెడు కస్తూరితిలకమిడిరి నెలఁతుకు నుదుటన్. 111

మ. సరవిం గన్నులఁ గజ్జలంబునిచి చంచచ్చందనస్వాదుప
త్రరుచుల్ చెక్కులఁ జేర్చి కర్కశకుచద్వంద్వంబునన్ గుంకుమ
స్ఫురణం బేర్పడఁ జేసి మానికపుసొమ్ముల్ శోభిలన్ బెండ్లికూఁ
తురు గావించిరి పేరటాండ్రు మహిభృత్పుత్రిన్ బ్రమోదమ్మునన్. 112

తే. గీ. హారతాటంక హారమంజీర కటక
కాంచికా హంసకద్యుతుల్ గడలుకొనఁగఁ
దనరు రాజన్యకన్యకఁ గనకపీఠి
నునిచి పాటలువాడిరి వనజముఖులు. 113

వ. అంత మహీకాంతుండు రంగవిభునకు మంగళస్నానాలంకారాద్యుప
చారంబులాచరింపందగిన పుణ్యాంగనలను వేదవేత్తలగు విప్రవరులం బంచిన
వారలమ్మహాత్మునిసందర్శించి వచ్చినకార్యంబు తెఱంగెఱింగించి తదనుజ్ఞఁ గైకొని.
114

ఉ. మోము చెమర్పఁ గన్నులఱమోడ్పు వహింపఁ గచప్రసూనముల్
వేమఱు జాఱువాఱఁ గుచపీఠిఁ గొరంగి సరుల్ నటింప హ
స్తామితరత్నకంకణచయధ్వని సొంపువహింప నొక్క కాం
తామణి నేర్పుచే సురభితైలమునం దలయంటె శౌరికిన్. 115

కం. ప్రాంచద్బహుమణి కీలిత
కాంచనకలశోదకములఁ గడువేడుక దీ
పించి జలకమాడించిరి
పంచాననమధ్య లబ్జపత్రాక్షునకున్. 116

సీ. వనితయొక్కతె నవ్యకనకపీతాంబరం
బందిచ్చె లోకైకసుందరునకు
తరుణియొక్కతె ఫాలతలమునఁ గస్తూరి
రేఖఁ దీర్చె వినమ్రలేఖనుతుకు

సుదతియొక్కతె సంకుమదమ్మృదుశ్రీగంధ
మలఁదె భక్తాభీష్టఫలదునకును
చెలియొక్తె మకుటకుండలముఖ్యభూషణో
త్కర మొసంగెను సుధాకరముఖునకు

తే. గీ. వెలఁదియొక్కతె సుమమాలికలు మురారి
కంఠమునఁ జేర్చె వేఱొక్క కంబుకంఠి
పసిఁడిపావాలు దొడిగె శ్రీపతిపదములఁ
జికిలిముకురమ్ముఁ జూపె నొక్కతె హరికి. 117

వ. ఇట్లు రంగైన సమస్తకామినులప్పురుషోత్తము నలంకరించి మెఱపించి శ్రీరుచివిలసితంబగు నొక్క సమున్నతకనకపీఠమ్మునందునిచి మహీసురమంత్రోచ్చారణరవంబు లెసంగం గొలిచియున్నంత. 118

సీ. అరుదెంచె గరుడదంచల్లాంఛితహంసాశ్వ
నాదయుండగు సారసోదరుండు
చనుదెంచె శుభ్రాభ్రసముదగ్ర పృష్ఠభాక
వాహితుండగు నీలలోహితుండు
నేతెంచె గతిచాతురీ హితాగోహణో
చ్చైశ్శ్రవుండైన వృద్ధశ్రవుండు
తరలివచ్చిరి మరుద్వరుణవహ్నికుబేర
ముఖులు శ్రీహరిపదాంభోజసఖులు

తే. గీ. నపుడు చేరిరి గంధర్వు లప్సరసలు
రంగవల్లభు పరిణయారంభ మెఱిగి
యందఱుచటకుపటం దెంచి రధిపుఁగొలువ
జయవిజయ శేషభుజగేంద్ర సైన్యపతులు. 119

కం. పెక్కండ్రు విబుధ శేఖరు
లొక్కటఁ దను జుట్టి కొలిచియుండఁగ దేవం
బక్కజముగ నారియొప్పెఁ
జుక్కలలోఁ జందురుండు శోభిలు భంగిన్. 120

ఆ. వె. కేరళేశ్వరుండు కేశవుతోడ వి
చ్చేయవలయు దడవు సేయవలదు
వరముహూర్తవేళ వచ్చుచునున్నది
యనుచుఁ జెప్పిపనిచె నచ్యుతునకు. 121

## నీళాకల్యాణము

కం. జనవరుని వలుకు లేర్పడ
విని రంగవరుండు చిత్తవృత్తులలర ము
న్ననువర్తించిన సురవర
మునిసంఘముతోడఁ గదలె ముదమొదఁ బౌరలౌఁ. 122

వ. ఇవ్విధంబున జగచ్ఛరణ్యుండగు శ్రీరంగవరేణ్యుండు సంఛాదితవిచిత్ర వర్ణోదీర్ణ కుధాంచలవిలంబిత చంచన్మణిమాలికాశోభితోభయపార్శ్వభాగంబును జిరత్నరత్నకింకిణీరుచిరసూత్రసంవేష్టితశింజానచతుశ్చరణంబును సుధాంశుకరనిభో గంతదంతంబునునగు పంటలవస్త్రంబు నారోహించె నప్పుడు. 123

సీ. అంకుశమ్ము ధరించి యహిపుంగవుం డాత్త
ఘనగరుడుం డంసభాగమున నమర
శేషాంశు ముఖ్యుండు జగజంపు లగి పంపు
తళుకుపలగొడుగు చందము పసుంప
కనక వేత్రము పూని గజిబిజి యుడుపఁగ వి
ష్వక్సేనుఁ డగ్రదేశమున నడువ
సనకాది నిగమాంతు లజయజయను విజయుం
రహిమించు సేవించు మునివరులు నవ

తే. గీ. బ్రహ్మరుద్రాది సకలసుపర్వవరులు
కదిసి యోతేఁ గగదీపికాసహస్ర
దీప్తపథమును విచ్చేసె దేవదేవుఁ
డమితవాద్యత్రఘోషమ్ము లతిశయిల్ల. 124

తే. గీ. సరససౌరభ మృగమదసాంకవాది
కలితచందనతాంబూలములు వసిండి
పల్లెరమ్ముల నిడుకొని ప్రమదమొసఁగఁ
బుణ్యకాంతలు చనుదేర భూవిభుండు. 125

వ. బంధుజనసహితుండై వివిధవాద్యరవమ్ములు పిక్కటిల్ల ముచుకుంద
వరదు నెదుర్కొని. 126

చం. మృదులసుగంధచూర్ణములు మేనులపైఁ గలయించి యందఱున్
గదిసినచోఁ నృపాలుఁడు జగత్పతికిం గలపంబల దిస
మ్మదమున సూనమాలికల మానితలీల నలంకరించి సొం
పొదవ విరించిరుద్ర పురుహూతిమునిద్విజులన్ గ్రమమ్మునన్. 127

వ. సముచితపూజావిశేషమ్ములం బత్నీసహితులగువారలకుం బ్రియంబు
నెఱపి యందఱందోడ్కొని చన నగరవీథిం గ్రమ్మకొను రంభాద్యప్సరోగణమ్ముల
నృత్తప్రకారమ్ముల వీక్షింపుచు మందగతిం జనునప్పుడు భేరీపటహఝాంకారఘోష
మ్ములును గాహళవేణువీణాగానస్వానమ్ములును దిశలం బర్వె నయ్యవసరమ్మున 128

సీ. తుంబురునారద స్తుతగీతరసలీల
భామగాయక గానఫణితి గాంచె
రంభోర్వశీకృత ప్రచురనాట్యవిధంబు
నగరవేశ్యానృత్తి నయత నెనసె
ఆంగీరసాదీరితాగమస్వరసిద్ధి
నగరద్విజోచ్చారణతఁ బొసంగె
సురకంఠమందారసూనసౌగంధ్యంబు
జనధృతప్రసవవాసనల నొదిగె

తే. గీ. మఱియుఁ గౌబేరనిలయ సంపత్ప్రభావ
మానృపతికోశగృహలక్ష్మి ననుసరించె
వింతగాదిది శ్రీరంగవిభుని కరుణ
కలిగె నేనియు నచట దుర్ఘటముగలదె. 129

వ. ఇత్తెఱంగున రంగవల్లభుండు మహీసురస్వస్తివాచనంబులతో నంతః
పురంబు సొచ్చి మొగసాల నేనుంగుడిగ్గి సేనాపతికరంబవలంబించి కక్ష్యాంతరంబులు
గడచి విరించిప్రభృతులు పొదివికొనిరా నేతెంచి ముందట నతివిచిత్రపాంచాలికా
సముదంచితస్తంభాభిరామంబును బరిస్తీర్ణమనోహరణాస్తరణశోభితంబునునగు కల్యా
ణావసథంబు నగుమొగంబునం బ్రవేశించి సపరివారంబుగా నాసీనులై యున్నంత. 130

తే. గీ. అపుడు నగరి పురోహితు లమరగురువ
శిష్టముఖ్యమునీంద్రులచే ననుజ్ఞ
కాంచి యుచితస్థలంబునఁ గనకవిరచి
తోపకరణమ్ము లునిచి మంత్రోక్తు లెసఁగ. 131

కం. వైవాహికసమయోచిత
పావనపీఠమున రంగపతి నునిచి యిఁకన్
వేవేగఁ గన్యఁ దోడ్కొని
రావలయునటంచుఁ బలుక రాజు ప్రియమునన్. 132

కం. చెలులఁ గని కన్యకామణి
నెలమిన్ దోడ్తెండు మీరలిపుడని పనుపన్
జలజాక్షులు వేగమె చని
కలవాణిం గాంచి ప్రేమ గడలుకొనంగన్. 133

ఉ. మతిమతి మాలతీసుమసమానశరీరిణి ! మంజుభాషిణీ !
కుతుకమెలర్ప లోకములకుం బతి నీపతియయ్యె, నయ్య నీ
కతిహితమాచరించె సముదంచితమయ్యె విగింపలేఖ ము
న్నతనుఁడు నిన్ను నేఁచె నిఁక నాతని నేఁచెదవమ్మ క్రమ్మఱన్. 134

తే. గీ. అనుచుఁ గించిదవాఙ్ముఖియైన రాజ
కన్య కరమూఁది తిగిచి యగ్గలికమిగులఁ
బొదివికొని వచ్చి చూపఱద్భుతము నొందఁ
దండ్రిముందట నునిచిరి తలిరుబోండ్లు. 135

తే. గీ. అంత సంకల్పతంత్రమంత్రాదివిధులఁ
బరగ వైదికముఖ్యు లేర్పడఁగఁజేయ
సరవిఁ గూర్చున్న యవ్వధూవరుల కపుడు
నడుమఁ దెఱఁబూనిరి భవుండు నళినభవుఁడు. 136

కం. జనపతి పసిండిపళ్ళెర
మున రంగేశుని పదాబ్జములు నిలిపి ముదం
బున శుభజలములఁ బ్రక్షా
ళనమొనరిచి మౌళిఁ దజ్జలమ్ము వహించెన్. 137

కం. దర్పకుఁడు విరిశరమ్ముల
దర్పం బెడయయ్యె ననుచుఁ దలఁక మహీశుం
డేర్పడ నొగి మధుపర్కం
బర్పించెన్ రంగపతికి నర్ఘ్యద్యుతికిన్. 138

కం. నరనాథుఁడు ప్రాగ్జ్యోతిష
ధరణీశుం డొసఁగు గంధదంతావళమున్
హరికి సమర్పించెఁ బురం
దరుఁ డిచ్చిన కల్పకుసుమదామమ్ములతోన్. 139

కం. ఆరట్టవిభుఁడు మును దా
కోరినక్రియ నిచ్చు చటులఘోటకముల ల
క్ష్మీరమణునకిచ్చెన్ మది
కూరిమి దళుకొత్త రత్నకుండలములతోన్. 140

వ. మఱియుం గులశేఖరధరారమణుండు మదింబొదవుముదంబు తుదిగానంబడక జగద్వల్లభుండైన యల్లునకుం బరార్థ్యహారకిరీట గోహిరణ్యాదిపదార్థంబులు సమర్పించె నంత వధూవరులకు మఱుంగుపడ నెసంగు తెఱ వీడంజేసిన. 141

సీ. రంగవల్లభు చూడ్కి రమణిమోమునఁ జెందె
సతిచూడ్కి విభుపదాబ్జమునఁ బెనఁగె
వరుచూపు బోటి కంధరమున విలసిల్లె
చెలిచూపు హరియూరువులఁ దనర్చె
కాంతువీక్షణ మింతిఘనకుచమ్ముల వ్రాలె
నాతివీక్షణ మీశు నాభి నెసఁగె
పతిదృష్టి సఖినితంబములపైఁ బ్రాపించె
యువతిదృష్టి మురారియురము బ్రాఁకె

తే. గీ. నాథుని విలోకనమ్ములు నాతి యూరు
జానుజంఘాదులకు డిగ్గెఁ జంద్రముఖి వి
లోకనమ్ములు భర్త బాహాకపోల
నయననిటలావలంబనోన్నతికి నెసఁగె. 142

తే. గీ. రంగపతి తన్నుఁ జూచిన రమణిమోము
వాంచు నతఁడొండుజూచినఁ గాంచుమఱల

హంసములు ఖంజరీటమ్ము లందిడింది
మొనసి డాఁగురుమూఁతలాడిన విధమున. 143

కం. సంగతి జగములకెల్లన్
మంగళదం బనుచు జనులు మదిమెచ్చఁగ నీ
శాంగన కంఠంబున హరి
మంగళసూత్రమ్ముగట్టె మది ముదమెసఁగన్. 144

ఉ. అంచితహేమపాత్రముల నక్షతముల్ దగ నాణిముత్యముల్
నించి నిజాప్తులిర్గడల నిల్చిన దంపతులింపుమీఱ ల
క్షించి చలించుదోయిళులఁ జేర్చి పరస్పరమాళులొప్పఁగా
నుంచిరి ముద్దులేనగవు లూఁతెడుమోములు సొంపుగుల్కఁగన్. 145

చం. పదపడి వహ్ని వేల్చి తనపాణితలమ్మునఁ బద్మగంధి కే
ల్మొదమునఁ గీలుకొల్పి ద్విజముఖ్యులు మంత్రములుచ్చరింప నం
బుదముపిఱుందఁ గ్రొమ్మెఱుఁగు బూనినరీతి లతాంగితోడ సౌ
ఖ్యదహుతభుక్ప్రదక్షిణము కైటభవైరి యొనర్చనయ్యెడన్. 146

వ. ఇత్తెఱంగునఁ గ్రమక్రమంబున వివాహకార్యక్రమంబు నిర్వర్తించి యొక్కమణిమంటపమ్మునందు సువిశాలమనోహరంబైనకుసుమతల్పమ్మునందయ్యి రువురుదంపతుల నునిచిరి. పుణ్యాంగనల జయమంగళంబను పాటల రవంబెసంగె వేణువీణాపణవాదివాద్యఘోషమ్ములుపిక్కటిల్లె గంధర్వగానంబువినంబడియెనచ్చ రలుపెచ్చుపెఱిఁగి తమహెచ్చులమెచ్చులెఱుంగుటకు విచ్చలవిడి నటనమ్ముసలుపం దొడంగిరిట్లు మహావిభవమ్మునం దేజరిల్లుచున్న శ్రీరంగవల్లభుం జూచి. 147

సీ. ఘటితరత్నచ్ఛటాజటిలహాటకమైన
మకుటమ్ము గమలసంభవుఁ డొసంగె
మంజురోచిఃపుంజ రంజితాభ్రంబైన
పచ్చలపతకమ్ము భవుఁ డొసంగె
మందారగంధసంబంధ బంధురమైన
హారవారము సునాశీరుఁ డొసఁగె
మానితాంబుజరాగ మణిమండితములైన
కుండలమ్ములు మృగాంకుం డొసంగె

తే గీ. వహ్ని వరుణాది దిక్పతుల్ వసనభూష
ణాదిసంభావన లొనర్చి రలవుమెఱసి
రందఱును నవ్యతులసికాహస్తులగుచు
మంత్రపుష్పమ్ము సంగిరి మాధవునకు. 148

సీ. నగముకల్వలతేని సరివచ్చు నుదుటిపైఁ
గ్రమ్మ కస్తురితిలకమ్ము దనర
కెమ్మోవిరుచిగ్రమ్మి కెంపులకై వడి
ముక్కుఱముత్తెముల్ మురువుసూప
రహిమించు చెక్కుల రవల తాటంకముల్
మితిలేని ధగధగద్యుతి నెసంగ
కుంకుమంబలఁదిన కుచకుంభయుగళిపై
మణిహారపంక్తి సంపదవహింప

తే. గీ. సిరులెనయుచూడ్కి పొదల ముంగురులు గదల
పసఁపుజిగిచీర మెఱయఁ బూఁబాన్పుమీఁద
ఘనుని చెంగట రాజన్యకన్యఁ జూచి
విబుధకాంతలు సిగ్గెత్తి వెల్లనెరి. 149

తే. గీ. భారతీపద్మసంభవుల్ పార్వతీత్రి
పురహరులు శచీపురందరులు మొదలు
సురవరోత్తము లవ్వధూవరులచేత
మిధునతాంబూలములు గాంచి రధికలీల. 150

కం. అంత వసంతములాడిరి
పంతములిగురొత్త విబుధపతు లచ్చరలున్
వింతగ సామంతులునటఁ
గాంతలతో చల్లుపోరు గావించిరొగిన్. 151

వ. ఇట్లు కృతోత్సవలీలావిశాలుండగు కులశేఖరనృపాలుండు కార్తాంతి కులవలన దంపతులనొకటిసేయుటకు ముహూర్తమ్ము నిశ్చయించి తత్సమయంబగు టయు నయ్యూరువుర సముజ్జ్వలాలంకారశోభితులంగావించి గంభీరస్తంభసంభాస మానమ్మును విచిత్రచిత్రపుత్రికామనోహరకుడ్యమ్మును వినూత్నపల్లవతోరణోల్ల

సితపురోభాగంబును వివిధవర్ణోపరినిబద్ధవితానవిలసితమ్మునువితానపర్యంతలంబమాన విద్యోతమానఖద్యోతసదృశసమృద్ధమణిమాలికాలంకృతమ్మునునగునొక్కరమణీయ మంటపమధ్యంబునందు. 152

తే. గీ. పచ్చరాఁగోళ్లు పవడంపుఁబట్టెయలును
వట్టువఱచిన నునుపట్టు పట్టెడలును
దనరు పర్యంకపాళి మందారకుసుమ
పుంజములు మంజులాకృతిఁ బొందుపఱచి. 153

కం. పొందుగ ఫలభక్ష్యమ్ములు
చందనకస్తూరికానుషంగ భరణికల్
సుందరతల్పప్రాంతము
నందునిచిరి చంద్రవదన లతిమోదమునన్. 154

వ. అయ్యవసరమ్మున. 155

కం. వాచస్పతియు వసిష్ఠుఁడు
శోచిష్కేశుండు తగినచోటుల మంత్ర
శ్రీచతురతఁ జూపిరి సము
యాచారవిచారకార్య మనుకూలముగన్. 156

కం. వాణియు శర్వాణియు గీ
ర్వాణాధిపురాణి గూడి రాణించు గుణ
శ్రేణిఁ దనరు నీళాక
ల్యాణిం దోడ్కొనుచుఁ జనిరి హరియున్నెడకున్. 157

వ. ఇట్లు దోడ్కొనిచనుదెంచి శ్రీవత్సాంకు పర్యంకసమీపమ్మున నిలిపి యిట్లనిరి. 158

ఉ. బొంకుటనేర దర్థిజనపోషణతత్పర సత్యధర్మని
ష్పంకచరిత్ర వృద్ధగురుభక్తిసమన్విత శీలసత్క్రియా
లంకృత కీర్తిశాలిని విలాసమనోహర తావకైకమో
హాంకురఖన్నహృన్నళినయై యిటులున్నది రంగవల్లభా! 159

ఆ. వె. సరసవచనరసిక! సకలపతివ్రతా
తిలక మీమృగాక్షి దేవ! నీదు

పత్నులందు మెచ్చుపడ నేర్చు నీముద్ద
రాలి మనసు దెలిసి యేలికొనుము. 160

కం. అని యప్పగించి దేవాం
గనలు నగవులొదవు వదనకమలమ్ములతోఁ
జనుటయు రంగేశ్వరుఁ డ
జ్జనపతిసుతవలనఁ గేలుసాచెన్ బ్రీతిన్. 161

ఉ. జృంభితభర్తృమోహ మొకచెంత నలంత ఘటింప నద్భుతా
రంభితయౌ నపత్రప భరమ్మున నిల్వఁగలేక మంటప
స్తంభము మాటుకుం జనినఁ దత్పరిరంభవిలోలచిత్తసం
రంభమునం గనుంగొనుచు రంగవిభుం డెలనవ్వు మీఱఁగన్. 162

కం. విరిపాన్పు డిగ్గి రంగే
శ్వరుఁ డయ్యరవిందగంధి జాడం జని త
త్కరపల్లవమ్ము నిజకర
సరసిజమున నూఁదినగ వెసఁగ నిట్లనియెన్. 163

కం. ఇది యేమే శుకవాణీ!
మదనాయాసమున నీవు మగువననుప నే
నొదవిన విరహాశ్రమమున
గదియం జనుదేర, నెట్లుగాఁ దొలఁగితివో! 164

వ. అనిపల్కి యయ్యతిం గౌఁగిటం జేర్చి పూఁబాన్పునకుం దెచ్చి మఱి
యనుమృదుమధురసల్లాపమ్ముల నబ్బోటి పుయిలోటఁదీర్చి రంగవల్లభుండు. 165

సీ. శశిబింబమెంతనఁ జాలు పూఁబోడి నె
మ్మోముపైఁ గదియంగ మోముఁజేర్చి
వసిఁడిచాయల డిందుపఱచుఁ జక్కనిచెక్కు
టద్దముల్ కళలంట ముద్దులిడియె
మృదులబింబఫలంబు నదలించు సఖమోవి
నలరు సుధారసం బానఁదొడఁగె
గజకుంభముల గెల్వఁగడఁగు పీనపయోధ
రంబుల నఖలాంఛనంబు లునిచె

తే. గీ. విరులు క్రొమ్ముడినుని చె ముంగురులుదడవె
ప్రబ్బి మేనులఁ బులకాంకురమ్ము లెసఁగ
మరుని చెయ్వులఁ బెనఁగొన్న మమతకతన
రమణి నీవికిఁ జెయిసాచె రంగవిభుఁడు. 166

తే. గీ. వ్రీడపెంపున నయ్యింతి విభుని కేలు
తనకరమ్మున బిగఁబట్టుకొనిన నగుచుఁ
జెలియ చిబుకంబు నివురుచుఁ జెలిమి నెరపి
రంగరమణుండు చెలి యనుగ్రహమువడసె. 167

వ. ఇట్లన్యోన్యబద్ధానురాగులగు నయ్యిరువురు సురతవిశేషవిహారమ్ముల మెలంగునప్పుడు చెదరినతిలకమ్ములును జిక్కువడినహారమ్ములును సడలిన కేశకలాపమ్ములును మిదురులగునూర్పులును గలిగి పరిశ్రాంతస్వాంతులగుచుఁ బర్యంకతలమ్మున శయనించియున్నంత. 168

ఉ. చందనశైలదేశమున సంజనితంబగుచుం సుమవ్రజా
మందసుగంధసంపద సమంజసమై విమలోల్లసత్సరో
బృంద పయఃకణవ్రజము పెంపెసఁగన్ మరుదంకురమ్ము గో
విందుఁడు సుందరీమణియు వేడ్కసుఖింపఁగ వీచె నయ్యెడన్. 169

ఉ. జాతవియోగదుఃఖయగు జక్కవ మెచ్చఁగ మున్నహర్ముఖ
శ్రౌతపు వేళఁదెల్పి విలసద్గతిఁ బద్మినిమేలనన్ మనః
ప్రీతిచెడన్ జకోరకము, బిట్టలుకన్ విటచోరభంగవి
ఖ్యాతములై యెసంగెఁ జరణాయుధకంఠకఠోరనాదముల్. 170

ఉ. అయ్యెడ మేలుకాంచి కమలానన మెల్లన శయ్యడిగ్గి కా
నొయ్యన సంచలింప ముడియూడిన కొప్పు నెఱుల్ నితంబమున్
నెయ్యమొనర్ప సల్లుకొను నీవి కరంబునఁబట్టి సిగ్గు సం
దియ్యక తోడ్పడంగఁ బడకిల్ వెడలెన్ బదముల్ తడంబడన్. 171

వ. ఇట్లు వెడలిచను నెడ నెచ్చెలులచ్చేడియఁంగూడుటయు లజ్జాభరమ్మునఁ జిఱునగవు నెఱయు మొగంబెగయింపంజాలక యూఱక చనుచున్న యన్నరపతిసుతం జూచి వారలిట్లనిరి. 172

ఉ. ఏమియుఁ జెప్ప విప్పుడది యేమి సరోరుహగంధి మున్నుగా
నీమది సంచలింప నతని న్గదియంబడి చుల్కనైతొ, యా
ధీమణి ప్రార్థనల్ వడసి తేజముగంటివొ ! చైవులన్నియున్
క్షేమముగోరు మాకు నెఱిఁగింపుము సఖ్యమునివ్వటిల్లగన్. 173

వ. అనిన వారలకిట్లనియె. 174

కం. అక్కట క్రొత్తకతలు మీ
రిక్కడ సెప్పెదరు వింటినింతియసరి యం
దొక్కటియు నే నెఱుంగను
జిక్కులఁ బెట్టంగనేల చేడియలారా ! 175

వ. అనిన సఖులిట్లనిరి. 176

తే. గీ. ఏమియు నెఱుంగననుచు నీవిపుడు మమ్ము
చిక్కువటిచెను సరులేలఁ జిక్కుగొనియె
కుచతటుల నెలవంకలగుంపు మోవి
కెంపు లివియేమి తెల్పవే కీరవాణి ! 177

వ. అనియిట్లు సాభిప్రాయవచనమ్ము లెసంగ మందస్మితాలంకృత వదనార
విందలగుచు నృపాలసుతం దోడ్కొని సముచితకృత్యమ్ములకుం జనిరంత. 178

ఉ. తామరసాకరోత్సవవిధాయి రథాంగవిహంగసంతత
క్షేమసమర్థనమ్ము సువిశేషబుధవ్రజ[వేద]భాషిత
శ్రీమహనీయమై రుచులఁ జెన్నెసఁగెన్ భువనైకదర్శన
ప్రేమరసావలంబ మినబింబము తూఱుపుకొండ కొప్పునన్. 179

కం. సూర్యోదయమ్మునకు స
త్కార్యా[హర్ముఖములెల్లఁ] గావించి మహా
దార్యధురీణుఁడు హరి దను
నార్యులుగొలువఁగ వరాసనాసీనుండై. 180

సీ. చంద్రచందనకళాసౌరభస్ఫురమాణ
వదనవక్షస్స్థవం బెసంగ

పాదాబ్జరాగవిభ్రమరుచిస్ఫ్రహణీయ
లలితాధరాలకోల్లసన మొప్ప
పల్లవాప త్తశోభాగభీరస్ఫుర
త్పదనాభిసురుచిరప్రతిభ దనర
శంఖకుంజరహ స్తసౌందర్యయుతదీర్ఘ
కంఠబాహువిలాసగరిమ దోఁప

తే. గీ. మంజు కేయూర కుండలమకుట హార
ముఖ్యభూషణములు మేన మురువుసూపఁ
దేజరిల్లెడు కరుణావిధేయు నెదుటఁ
గాంచె దేవనికాయమ్ము గారవమున. 181

వ. ఇవ్విధంబునం గాంచి చతుర్ముఖశర్వగీర్వాణవల్లభులు దేవమునిసహి
తులై రంగవల్లభునకుం బ్రణామమ్ములాచరించి ప్రసాదసుముఖుండగు నమ్మహాత్ము
నిచే ననుజ్ఞాతులై నిజస్థానమ్ములకుంజనిరి కులశేఖరమహీవల్లభుండు నల్లని యభి
ప్రాయంబెఱింగి ప్రయాణోచితమ్ములగు చతుర్విధసైన్యమ్ముల సమకట్టంబనిచె
మఱియును. 182

చం. ఉరుతరత ప్తహేమ కలశోపహితాగ్రము పార్శ్వభాగ భా
సురసురరాజరత్నరుచిశోభితదారుచయమ్ము కేతువి
స్ఫురిత విహంగపుంగవ విభూషిత మద్భుతవేగవాహబం
ధురమగు తేరు రంగరమణుం డెదమెచ్చఁగఁ జెంతనిల్పినన్. 183

తే. గీ. అత్తమామలు మ్రొక్కుచు ననుపవెడలి
కనకమయరథమెక్కె రంగప్రభుండు
ప్రాగ్దిశాశైలశిఖర సంభావ్య మగుచు
భానుబింబమ్ము శోభిల్లు వగిదిదోఁప. 184

తే. గీ. తన్ను నెడబాయు నడలునఁ దాల్మివిడిచి
చిన్నవోయిన పూఁబోణిచిన్నె దెలిసి
జనని భాషించె వగవకే! సరసిజాక్షి!
కోరుకొన్నంత మేలు చేకూరె నీకు. 185

తే. గీ. నతహితుండగు శ్రీరంగనాయకుండు
ప్రేమ నేతెంచి నిన్ను వరించివాఁడు
నగుచుఁ బదవమ్మ యింకేల పగవ నీకు
జగములకు నెల్ల నేలికసానివగుచు. 186

వ. అని యూఱడించి యనేకగోహిరణ్యమణిభూషణాంబరదాసీదాసజనం బులఁ గూఁతునకు కరణం బిచ్చి కౌఁగిలించికొని సువర్ణరత్నప్రభాశోభితయగు శిబిక నుంచి రంత. 187

చం. ఘనగజరాజ వాజిభట కంపితభూతలమైన సైన్యముఁ
గొని నరపాలశేఖరుఁ డకుంఠితవైభవ మొప్పఁ గూఁతుఁ దో
డ్కొని చన నుత్సహించి తనకుఁ హితవైష్ణవపంక్తి తోడ్పడన్
జననుతుఁ డేగె రంగపతిసన్నిధి సన్నిధిగాఁ దలంపుచున్. 188

సీ. పృథుల [ప్రయాణ] భేరీరవం బొక చాయ
విమతుల గుండియల్ ప్రేలఁ జేయ
వేణుమర్దళశంఖవీణాస్వనము లొక్క-
కడ జనశ్రవణోత్సుకత ఘటింప
వసుధామరస్వస్తివచనస్వరము లొక్క
* * ము చెంగప
వందిమాగధ చారణవారాళి యెసఁగ
యొకచక్కి నాశీర్వ్యాయుక్తి నునుప

తే. గీ. మఱియు వారాంగనాగాన మధురనాట్య
భంగు లీక్షించు పౌరప్రసంగ మొసఁగఁ
గుతుకమే పారఁ గుక్కుటకూటనగరి
విధి నల్లన శ్రీరంగవిభుఁడు జనియె. 189

వ. ఇట్లు బహుపరిజనసహితుండును భక్తివినయసంపన్నుండును నగు కుల శేఖరమహీపాలుండు గొలిచిరా రంగవల్లభుండు కతిపయప్రయాణమ్ముల శ్రీరంగ నగరసమీపమ్మునకుం జనునప్పుడు. 190

సీ. ఉచితదివ్యప్రబంధోచ్చారణధ్వాన
భాసురాస్యులు మహాభాగవతులు
రమ్యకర్పూరనీరాజనభాజనో
జ్జ్వలపాణియగు సాధుసముదయమ్ము
మహితతోషానాహే ఖమనుగస్వాగతమ్ములఁ
బ్రకటింపు మన్న గాయకచయమ్ము
సురుచిరచ్ఛత్రచామరముఖచిహ్నముల్
పేర్మిఁ గైకొనివచ్చు భృత్యగణము

తే. గీ. నెమ్మనసను రంచి మ్రొక్కుచు నెల్లకడలఁ
గ్రమ్మికొను పౌరసంఘంబు గదిసినడువఁ
జెలఁగి కన్యాజనమ్ములు సేసలిడఁగ
రాజవీథుల విచ్చేసి రంగవిభుఁడు. 191

కం. గవనులు కొన్ని గడచి రం
గవరేణ్యుఁ డపుడు రథముడిగ్గి ఘనమణిపీఠిన్
నివసించి యిందిరాసఖు
నవసర సేవంగఁ బిలిచి యటు నిల్పనిచెన్. 192

నీళను శ్రీదేవి పరిగ్రహించుట

కం. వనజాక్షులార! నీళాం
గనఁ దోడ్కొని మీరలిపుడు కమలాలయ ద
ర్శనము ఘటియింపుడన వా
రనుపమగతి నీళతోడ నరిగిరి వేడ్కన్. 193

వ. ఇవ్విధంబున నిందిరాదేవి సన్నిధానంబునకుం దోడ్కొనిచని తత్పా
దమ్ములకు మ్రొక్కించిరప్పుడు. 194

తే. గీ. మున్ను వినియున్నకతన నంభోజసదన
తనకు మ్రొక్కిన రాజన్యతనయఁ గాంచి
యొనర దీవించి కౌఁగిట నెనయఁ జేర్చి
యొలమి ముందట నిడుకొని యిట్టులనియెఁ 195

కం. సేమమె ! నీతలిదండ్రుల
కీమానితమూర్తి మదికి నెక్కినరూపం
బీమహిమ నీకుఁగలుగుటఁ
గామించె వరించె మేలుగలిగెన్ దరుణీ ! 196

వ. అని పలికిన లజ్జాభయమ్ములనత్తన్వి నెత్తమ్మితేకులమొత్తమ్ము నుత్తలపడంజేయుకన్నుల నిలాతలమ్ముఁజూచుచు నెమ్మొగంబెత్తకయున్నచిన్నె యెఱింగి శ్రీదేవియిట్లనియె. 197

తే. గీ. సుదతి ! మోమెత్తి నావంకఁ జూడవేమి
తొల్లిఁటితెఱంగు విన సపత్నులము మనము
అక్కచెలియండ్రమనెడి నెయ్యమ్ము గలుగ
వెఱచి యిటులుండ నేటికి వెఱ్ఱివగుచు. 198

మ. అలివేణీ ! శుకవాణి మున్న మనమయ్యబ్జాక్షు దాస్యమ్ము సం
ధిలఁ గ్రీడించుచునుండువార మిపుడద్దేవుండు రంగేశుఁడై
నిలువన్ బద్మకుడుంగ రాడ్గృహములన్ దీపించియిట్టుల్ సప
త్నులమై కూడెడుభాగ్యమబ్బె హరి నిన్నున్ నన్ను బ్రోచున్ గృపన్. 199

కం. అన నృపకన్యక పలికెన్
జననాసఁగితి నాదుపూర్వచరితము దెలిసెన్
ఘనతన్నీ కడఁ జేరితి
మనమున నాకింకి వెఱపు [మాటయు] గలదే ! 200

వ. అనిన శ్రీదేవి భూపాలకన్యకంజూచి సంతసిల్లుచు నిట్లనియె. 201

కం. అదనిదియె నీదుమదికిన్
గాదువలులేవింకఁ జక్రిగూడి సకలసం
పద లనుభవింపుమేలిమి
పదవే ! ఫ్రాంఁబోడి [వాసభవనమ్మునకున్] 202

వ. అని యయ్యింతి నుత్సహింపఁజేసి సఖులందోడిచ్చి నిజసౌధంబునకుం బనిచె నంత రంగవల్లభుండల్లనల్లన నిజాగ్రమహిషీసమీపమ్మునకుం జనుటయు నయ్యబ్జగేహిని యొక్కింతకినుక నెరయ నతనింజూచుచునిట్లనియె. 203

కం. ఈసారి పెండ్లికూఁతురు
నేసీమం దెచ్చికొనఁగ నిచ్చఁదలఁచితో!
ఆసపడి మానవగునే
వేసరకుఁడి క్రొత్తచెలుల వెదకెడువనికిన్. 204

కం. నావుడు శ్రీహరి యిట్లను
దేవి వధూమణుల నేను దెచ్చుటలు భవ
త్సేవాసరిచర్యలకుం
గావలెననికాదె! వేఱుగాఁ దలఁపకుమీ! 205

కం. అప్పలుకులు విని యిందిర
తప్పక విభుమోముఁజూచి ధర్మాత్ములు మీ
రెప్పటికి [మాయ] లెఱుగరు
చెప్పకుడిఁక మేలిపనులు చేసెదరెలమిన్. 206

ఉ. కుంఠితవైరి! మున్ను నినుగూడి చరించెడి వేళలందు వై
కుంఠములోన నీళ యనుకూలసఖీత్వ మొనర్చఁగాన యు
త్కంఠత జనించె నింకనొరుకన్నియఁ దెచ్చెదవేని దాని సో
ల్లుంఠములాడి రంగపురిలో వెడలింతుఁజుమీ! జగత్పతీ! 207

వ. అనిమేలంబునం బలికి నెమ్మొగమ్మునం జిఱునగవు నెఱయ నగధరుం గౌఁగిలించికొనియె నిట్లయ్యిరువురు చతురసల్లాపరసానుభవమ్ము సేయుచు నాత్మీయ సౌధంబునకుం జనిరి మఱియును. 208

సీ. మంజులోద్యాన ద్రుమచ్ఛాయ లందుండి
శుకకోకిలోక్తుల సొంపు వినుచు
పద్మకైరవసౌరభము లొప్పుకొలఁకుల
సలిలకేళీసముత్సాహు లగుచు
మణిమయప్రాసాద మహితస్థలమ్ముల
రమ్యవీణాగానరసికు లగుచు
కలితమౌక్తికమాలికా డోలికల నెక్కి
లాలితక్రీడావిలాసు లగుచు

తే. గీ. ఘనజనాలోకనానందకారులగుచు
ప్రేమ నీళాంగనారంగధాము లపుడు
బంధురైశ్వర్యసౌఖ్యసంపదలఁ బొదలి
యెలమిఁ బెంపొంది రానందకలన దనర. 209

కం. ఇప్పెఱఁగున నిజపుత్రి యు
దాత్తమహాసౌఖ్యభోగదశ గని భూపా
లోత్తముఁడు సంతసిల్లుచుఁ
జిత్తమునం దనపురమ్ము జేరం దలఁచెన్. 210

కం. రంగపతికిఁ బ్రణమిల్లి సు
సంగతమౌ గతి నతండు సరవి సనుప పు
త్రిం గాంచి గారవించి ర
మాంగనకున్ మ్రొక్కి పలికె నతిమోదమునన్. 211

కం. గోమునఁ బెరిగినయది మది
నేమియుఁ గాపట్యమెఱుఁగ దెఱుక నొసఁగినన్
బ్రేమఁగొను సదుగ దద్దియు
నీమఱువునఁ జెల్లెలనఁగ నిలుపుము వేడ్కన్. 212

ఉ. చల్లనిచూపు లెంచు వెదఁజల్లి జగమ్ములఁ బ్రోతువీవు మా
తల్లివి భవ్యవైభవమతల్లివి సేవకకల్పవల్లి! ని
న్నెల్లబుధుల్ భజించుకత లేమెఱుఁగున్ బసికూన! దీని నీ
చెల్లెలిగాఁ దలంచి కృపసేయుము నేరములేమొనర్చినన్. 213

తే. గీ. అనిన శ్రీదేవినగుచు నోయవనిపాల!
మదిచెదరి కూఁతునప్పగించెదవు గాక
జన్మజన్మమ్ములను విష్ణుసేవల మునుఁగుచుఁ
జెలిమినుండెడు మాకిన్ని చెప్పనగునె! 214

కం. అనఘ! భవత్సుత మీగృహ
మున మెలఁగినయట్ల యిచట ముదమున నలరున్
ననుగూడి చెలఁగుచుండెడి
మనమున సంతోషమెసఁగ మరలుము పురికిన్. 215

వ. అనిరమాదేవియానతిచ్చిన సంతుష్టాంతరంగుండై తన్నుం గృతార్థుం గాఁ దలంచుచు స[కలపరిజనయు]క్తుండై నిజనగరంబు ప్రవేశించె మఱియు. 216

కం. శ్రీవైష్ణవ పూజాసం
భావనలేమిఁ జక రామభద్రచరిత్ర సే
వావిలసితహృదయుండై
భూవరుఁ డాశ్రితులకుఁ గామ్యప్రదుఁడాయెన్. 217

సీ. సతతమ్ము పురమునఁ జాటించు భేరీమృ
దంగ మెసంగ శ్రీరంగయాత్ర
రచియించె హరిభక్తిరసము జొబ్బిల బుధా
నందానుకూల ముకుందమాల
నిఖిలప్రపన్నవర్ణితముగాఁ బ్రకటించె
బంధురద్రవిడ ప్రబంధమొకటి
సంతత శ్రీరామచరితామృతాస్వాద
* * స్తగాంచె

తే. గీ. బహుళ నీవృత్తిసమాయాత భాగవత జ
నాభినందన గురుసపర్యాభిలషిత
వస్తువిశ్రాణన క్రియావశత నెసఁగ
నతహితుండగు దృఢవ్రతి నందనుండు. 218

కం. చిరకాలము భూపాలన
వరుఁడై ........................
స్ఫురణమ్మున నిజతనయున్
గరిమన్ బట్టాభిషిక్తుఁ గావించె వెసన్. 219

వ. ఇట్లు సప్తాంగంబు తనివశమ్ము జేసి నిర్భరచిత్తుండై యుండె మఱియును.

తే. వసుధఁ బాలించి శ్రీవైష్ణవప్రియార్చ
నంబు గావించి జానకీనాథుఁ గొలిచి
...............................రూఢుఁడగుచు
నెమ్మి నృపమౌళి విష్ణుసన్నిధికిఁ జనియె. 221

వ. అని యిత్తెఱంగు. 222

కం. గురువర్యుఁడు శిష్యునకున్
నిరుపమకులశేఖరావనీవల్లభు స
చ్చరితం బంతయు నేర్పడ
కరుణం దగ నానతిచ్చి క్రమ్మఱఁ బలికెన్. 223

కం. కులశేఖరాళువారుల
విలసితచరితమ్ము జగతి వినినఁ జదివినన్
గలుషవ్రజమ్ముదొలఁగెడు
నెలమిం బ్రాపించు నరుల కిహపరసుఖముల్. 224

వ. అనిపలికి శిష్యోత్తమా! పరమపవిత్రంబగు కులశేఖరచరిత్రంబు సవిస్తరంబుగా నీకు నెఱింగించితిననుటయు శిష్యుండాచార్యునకుం బ్రదక్షిణాపూర్వకంబుగా బ్రణామంబులాచరించి విమలంబులగుకుసుమచందనంబులం బూజించి మమ్ముం గృతార్థులం జేసితిరని యానందరసభరితాంతఃకరణులై విలసిల్లిరి తెఱంగున. 225

మ. తరుణీలోలపితృప్తిపాలనకళాధౌరేయ! గాధేయదు
ర్భరభవ్యాధ్వరమంత్రతంత్రకలనాప్రత్యూహకృద్దైత్యసం
హర! రంహోభయదాబ్ధిగర్వదళనోద్యద్రక్తనేత్రాంచలా!
ధరధైర్యాఢ్య! ధరాధురాధరభుజా! ధారాధరాంగద్యుతీ! 226

కం. కాకమదోద్రేకతమో
... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
..................
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... 227

మాలిని. ......................

* *

కలశజనుతిశాలీ క్రముపద్మాక్షమాలీ
విలులితసదవద్యా వేదవేదాంతవేద్యా 228

గద్యం. ఇది శ్రీరామచంద్రకరుణానిరీక్షణసమాసాదితకవితావిశేష శేషాన్వయప్రదీపక వేంకటాచార్యకుమారరఘునాథార్యప్రణీతంబైన కులశేఖరమహీపాలచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము. 229

సంపూర్ణము